# భక్తపురందరదాసు

(నాటకము)



ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

దాససాహిత్య ప్రాజెక్టు [illegible]

# భక్తపురందరదాసు

## ( నాటకము )

కన్నడ మూలం :

కె. అప్పణ్ణాచార్య

స్పెషల్ ఆఫీసర్, దాససాహిత్య ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

తెలుగు అనువాదము :

శ్రీ వేదవ్యాస శ్రీరంగరాజ సుదర్శనభట్టాచార్య



ప్రచురణ :

ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఎ.ఎస్.,

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1986

**BHAKTA PURANDARADASU (PLAY)**

**By :**

**Sri K. Appannacharya**

***Translated from Kannada :***

**By**

**Sri Vedavyasa Srirangaraja Sudarsana Bhattacharya**

**T. T. D. Religious Publications Series No. 308**

**First Edition : 1986**

**Copies : 3,000**

**Price :**

**Published by :**

**Sri S. Lakshminarayana, I.A.S.,**
**Executive Officer,**
**Tirumala Tirupati Devasthanams,**
**Tirupati — 517 501**

**Printed at :**

**Tirumala Tirupati Devasthanams Press,**
**Tirupati.**

# ప్రకాశకుల తొలిపలుకులు

కలియుగ ప్రత్యక్షదైవమైన వేంకటేశ్వరస్వామిని పాడిపొగడిన మహాత్ముల సాహిత్యాన్ని ప్రచురించాలన్నది తిరుమల తిరుపతి దేవస్థానాల ముఖ్యోద్దేశం. జ్ఞానులందరూ శ్రీనివాసుని మనసారా సేవించి స్తుతించివున్నారు. దేశకాలభేదాలు ఆ కరుణామయునికి లేవు. పదకవితా పితామహులుగా ప్రసిద్ధులైన శ్రీఅన్నమాచార్యులు ఆయనను తెలుగులో కీర్తిస్తే, ఆళ్వార్లు తమిళభాషలో స్తుతించారు. పురందరదాసాది హరిదాసులనేకులు ఆ దేవదేవుని కన్నడభాషలో సంస్తుతించి వున్నారు. ఈ మహాత్ముల సాహిత్యం విశ్వసాహిత్యం అయ్యింది. ఈ విశ్వసాహిత్యాన్ని దాని ప్రణేత్రుల చరిత్రలనూ అన్ని ప్రాంతాలవారికి, ఆ యా భాషలలో అందించడం ప్రస్తుత కర్తవ్యంగా వుంది

పరమాత్ముని సేవకోసం తమ సకల సంపదలనూ త్యాగంచేసిన వారూ, సమాజసేవకోసం తమ జీవితాన్ని అంకితంచేసిన వారూ, శ్రీనివాసునితో ఆటలాడినవారూ, దాక్షిణాత్యసంగీతాన్ని క్రమబద్ధంగానూ, సలలితంగానూ చేసిన పుణ్యాత్ములూ, సంగీతపితామహులూ అయిన శ్రీ పురందరదాసుల జీవితచరిత్రను తెలుగులో, నాటకరూపంలో సహృదయులకు అందిస్తున్నాము.

కన్నడనాటకాన్ని చక్కగా అనువదించిన శ్రీభట్టాచార్యగారికి ధన్యవాదాలు తెలియచేస్తున్నాము. కర్ణాటకహరిదాసశ్రేష్ఠుడైన పురందరదాసుల చరిత్రను తెలుగుపాఠకులకు అందిస్తున్న మా ప్రయత్నం సఫలంకాగలదని ఆశిస్తున్నాము.

తిరుపతి,
డిసెంబర్ 12, 1988.

ఎన్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్;
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

# ఈ నాటకములోని పాత్రలు

1. సూత్రధారుడు
2. నటి
3. శ్రీనివాసనాయకుడు (పురందరదాసు)
4. సరస్వతీబాయి (శ్రీనివాసనాయకుని భార్య)
5. బ్రాహ్మణుడు
6. బాలకుడు (బ్రాహ్మణుని పుత్రుడు)
7. వరదుడు (శ్రీనివాసనాయకుని కుమారుడు)
8. రామాచార్యులు
9. కృష్ణాచార్యులు
10. నరసన్న
11. హనుమయ్య
12. రామన్న
13. అయిదారుగురు రైతులు
14. అన్నమాచార్యులు
15. శ్రీవేంకటేశ్వరస్వామి
16. అర్చకుడు
17. అధికప్రసంగి
18. శ్రీబాలకృష్ణుడు

# నాటకమున రంగస్థల అలంకరణ

ప్రస్తావన: సూత్రధారుని గృహము. నటరాజ విగ్రహము లేదా చిత్రము. ఇది గోడకి ఆనించి గాని, వేళ్లాడదీయబడి గానీ వుండవలెను. క్రిందిభాగంలో పగులగొట్టబడిన టెంకాయ, అరటిపళ్ళు, హారతిపళ్ళెము వుండవలెను. ఒకవైపున రెండు మృదంగములు, తంబూర, కాలిగజ్జెలు వుండవలెను.

ప్రథమాంకము: ఐశ్వర్యాన్ని ప్రతిబింబించే శ్రీనివాసనాయకుని గృహం. రంగస్థలం కుడివైపున సర్వాలంకార శోభితమైన బృందావనం. దానిముందు హారతిపళ్ళెం. కుడి ఎడమల రెండు దీపస్తంభాలు. ఒక పళ్ళెంలో పూలు, పళ్ళు, పసుపు, కుంకుమలు, ఒక నీళ్ళచెంబు. వెనకవైపు ఒకఖాళీ బిందె.

రంగస్థలం ఎడమవైపున రెండు ప్రాచీనకాలం కుర్చీలు. మార్వాడీపరుపు, ఆనుకోడానికి రెండుదిళ్ళు. పరుపుముందు త్రాసుబల్ల. దానిమీద బంగారాన్ని తూచే తక్కెడ. లెక్క పుస్తకాలు. బంగారాన్ని పరీక్షించే ద్రావకం సీసా. ప్రక్కన సిరాబుడ్డి, కలం.

ద్వితీయాంకము: ప్రథమాంకంలో మాదిరిగానే వుండాలి.

తృతీయాంకము: పల్లెటూరి వాతావరణాన్ని సూచించే వీథిదృశ్యం తెర. మధ్యలో ఒక అరుగు. అరుగుమీద పసుపుకుంకుమలతో తెల్లపూవులతో అలంకరింపబడిన రాయి (గ్రామదేవత)

చతుర్థాంకము: తిరుమల వెంకటేశ్వరుని గర్భగుడి పక్కనున్న యజ్ఞ మంటపం రూపాన్ని ప్రతిబింబించే తెర. ఒకపక్కనయజ్ఞ కుండం. (ఇది లేకపోయినా ఫరవాలేదు) వెనుక బంగారం రంగులో మెరుస్తున్న ఒక చెంబు.

పంచమాంకము: రెండువైపులా ఇళ్ళవరుసలున్న వీధిదృశ్యాన్ని ప్రతిబింబించే తెర. (విష్కంభానికి మాత్రం) పంఢరాపురం విఠలదేవాలయ దృశ్యం, రెండువైపులా స్తంభాలు. ఈ అంకంలో రంగస్థలం దేవాలయం లోపలిభాగంలో లాగా వుండాలి.

—

# పాత్రధారులకు అవసరమైన వస్తువులు

## -: వేషధారణ విధానం :-

**సూత్రధారుడు:** వయస్సు సుమారు 40 ఏళ్ళు. పండితశాలువ, కంఠహారాలు, కుండలాలు, ఉంగరాలు, కాళ్ళకి కడియాలు, అంచు వున్న పట్టుధోవతి. తలకి ఎర్రటిపాగా. మెడలో ఒకటి రెండు తులసిపేరులు, బంగారు పతకాలు. తంబుర. నుదుట తిలకం.

**నటి:** వయస్సు 20 - 25 సం॥లు. భరతనాట్యానికి అనువైన వేషధారణ.

**నటుడు:** వయస్సు 25 సం॥లు. తలకి విగ్గు. కుండలాలు. ధోవతి. ఉంగరాలు. పట్టు అంగవస్త్రం. తులసిపేరులు. నుదుట తిలకం.

**శ్రీనివాసనాయకుడు:** వయస్సు సుమారు 30 సం॥లు. మహారాష్ట్ర ప్రాంత ధనికుడివేషం. తలకి విగ్గు. తలపాగా. చెమ్కి కోటు లేదా పట్టుజుబ్బా. జరీఅంచు పట్టుధోవతి. కుండలాలు. జరీఅంచు ఉత్తరీయం. కంఠంలో రెండు ముత్యాల హారాలు. బంగారుపతకహారం. వేళ్ళకి ఉంగరాలు, కాళ్ళకి ప్రాచీనకాలం తరహా పాదరక్షలు. ప్రాచీనకాలం తరహా డబ్బు సంచీ. తాళపత్రాలు, కలం. ముక్కెర పెట్టుకోడానికి తగిన చిన్నడబ్బి. చెల్లని నాణ్యాలు. చిలుముపట్టిన నాణెం ఒకటి. ఒక ముక్కెర.

**పురందరదాసు:** వయస్సు 40 సం॥లు. దాసవేషాన్ని చిత్రంలోవున్న విధంగా వేసుకోవాలి. తలకు చుట్టుకోడానికి అంచువున్న కావిగుడ్డ. కాళ్ళకు గజ్జెలు. తులసిపేరులు. తంబూరా, చిడతలు, గోపాలబుట్ట (లేక కావిరంగు జోలె) చిత్రంలోవున్న విధంగా నామముద్రలు వేయాలి.

సరస్వతీబాయి: వయస్సు 25 సం॥లు. గోచీపోసి కట్టుకోడానికి ఉపయోగించేలా 9 గజాల చీరలు మూడు. ఒకటి పట్టుచీర. రెండు సాదాచీరలు. ప్రథమ, ద్వితీయాంకాల్లో పట్టుచీర, తృతీయ చతుర్థాంకాల్లో సాదాచీరలు ధరించాలి. ప్రథమ, ద్వితీయాంకాలలో ధనికస్త్రీకి అవసరమైన అన్ని ఆభరణాలూ వుండాలి. ముత్యంతోవున్న (వజ్రం) ముక్కెర.

వరదుడు: వయస్సు 15 సం॥లు. ద్వితీయాంకంలో ధనికవేషం. తలకి విగ్గు. తండ్రిపాత్రకి లాగానే నామాలు. మెడలో రెండు ముత్యాలహారాలు. చేతులకి కంకణాలు, ఉంగరాలు. తృతీయ, చతుర్థ, పంచమాంకాల్లో సాదా ధోవతి కట్టి, పైన కావిరంగు అంగవస్త్రం వేసుకోవాలి. తులసిపేరులు వేసుకోవాలి. తండ్రిపాత్రలాగానే నామాలు ధరించాలి.

వృద్ధబ్రాహ్మణుడు: వయస్సు 70 సం॥లు. తెల్లటి జుత్తుతో విగ్గు. అదే రంగు గెడ్డమూ, మీసాలూ. పండితశాలువ. మెడలో 2, 3 తులసిపేరులు. తెల్లటి సాదాపంచ. పాతకాలపు చేతికర్ర. చిత్రంలో చూపిన విధంగా నామాలు.

బాలకుడు: వయస్సు 8-10 సం॥లు. జుత్తుతోవున్న విగ్గు. తులసిపేరులు కట్టుకోడానికి తెల్లటి పంచ. సామాన్యమైన అంగవస్త్రం. పిల్లవాడు ఎంత చిన్నగావుంటే అంత మంచిది. చిత్రంలో చూపిన విధంగా నామాలు.

బాలకృష్ణుడు: వయస్సు 8 సం॥లు దాటరాదు. నెమలిఈకలతో వున్న విగ్గు. పీతాంబరం. పిల్లనగ్రోవి. బాలకృష్ణుడికి అవసరమైన ఆభరణాలు. ఈ పాత్ర ధరించే పిల్లవాడు ముద్దుగా వుండాలి. బాలకుడి పాత్ర ధరించిన కుర్రవాడే ఈ పాత్ర ధరించవచ్చు.

రామాచార్యులు: వయస్సు 70 ఏళ్ళు. తెల్ల శిఖాగ్రవిగ్గు. అదే రంగు గెడ్డమూ, మీసాలూ. పండితశాలువా. తెల్లటిధోవతి. తులసి పేరులు. నామాలు చిత్రంలోలాగా ధరించాలి. గోపీచంద

నంతో నామాలు పెట్టుకోవాలి. నుదుట అంగార అక్షితలు అవసరం లేదు.

అర్చకుడు: జుట్టుతోవున్న గ్రీకలర్ విగ్గు. తెల్లటిధోవతి. కావిరంగు అంగవస్త్రం. తులసిపేరులు. నామాలు ఎక్కువగా అక్కర లేదు. నుదుటిమీద గోపిచందనంతో ఒక పెద్దనామం. మధ్యలో కుంకుమబొట్టు. (పండరీపురంలో అర్చకులలాగా) ఒకపళ్ళెం, చెంబు, 2, 3 అరటిపళ్ళు. చెంబులో నీళ్లు. రామాచార్యులపాత్ర ధరించినవ్యక్తి ఈ పాత్రనీ ధరించ వచ్చు. వయస్సు 70 సం॥లు.

కృష్ణాచార్యులు: వయస్సు 70 సం॥. రామాచార్యులలాగే వేషధారణ. గెడ్డం అనవసరం. ఈ పాత్ర అప్పటికి స్నానంచేయలేదు గనుక నామాలు అక్కరలేదు.

అధికప్రసంగి: నల్లరంగు విగ్గు. పట్టుధోవతి. పండితశాలువ. చెవులకి బంగారుదుద్దులు. తులసిపేరులు. చేతులకి కంకణాలు. పాతకాలపు చేతికర్ర. ఇతను అహంకారి. ఉత్తముల్ని నిందించడమే ఇతని పని. నామాలు అక్కర్లేదు. గోపి చందనంతో నుదుట పెద్దనామం, మధ్యలో కుంకుమబొట్టు. (పండరీపురం వ్యక్తిలాగా) కృష్ణాచార్యుల పాత్రను ధరిం చిన వ్యక్తి ఈ పాత్రను ధరించవచ్చు.

నరసన్న
హనుమయ్య
రామన్న

పల్లెటూరి వ్యక్తులు. ధోవతుల్ని మోకాళ్ళపైకి కట్టుకో వాలి. తలకి పాగాలు. పెద్దమీసాలు. ఒంటిమీద కంబళ్లు తప్పెట్లు. చేతుల్లో కత్తులు. కత్తులకొనలకి గుచ్చిన నిమ్మ కాయలు, నుదుటకుంకుమబొట్లు. నడుములచుట్టూ వేపాకు కట్టుకోవాలి. ఒకకోడి, ఒకమేకపిల్లా వుండాలి. సూత్రధారి పాత్రధరించిన నటుడు వీళ్ళలో ఒకపాత్ర ధరించవచ్చు. వయస్సు 30, 40, 50 సం॥లు.

దండనాయకుడు: వయస్సు 40 సం॥లు. కత్తి, డాలు, శూలం. పైనిక వేషం. నామాలు అవసరం లేదు.

శ్రీవేంకటేశ్వరస్వామి: శ్రీమన్నారాయణుని వేషం. నుదుట వేంకటేశ్వర స్వామివారికి లాగా మూడు నామాలు.

గమనిక! నాలుగవ అంకంలోవున్న అన్నమాచార్యులపాత్రను అను కూలం వున్నవాళ్లు ఉపయోగించుకోవచ్చు. అప్పుడు ఆ పాత్రని రెండవ అంకంలో వృద్ధబ్రాహ్మణవేషం ధరించిన వ్యక్తి ధరించవచ్చు. అన్నమాచార్యుల పాత్ర వయస్సు 80 సం॥లు. తెల్లటిజుత్తు, తెల్లటి గెడ్డం, తెల్లటి ధోవతిని ధరించాలి. మెడలో తులసిపేరులు. నుదుట వేంకటేశ్వర స్వామివారికిలాగా మూడు నామాలు.

ఈ పాత్రను వదలివేయదలిస్తే పురందరదాసులు "పవళిసు పరమాత్మనీ" .... నుండి "యావ దేవరిగుంటు ...." వరకూ చెప్పి, నేలమీద వస్త్రాన్ని పరచి పడుకోడానికి సిద్ధమైనట్లు నటించాలి. ఇదే విధంగా ఆదే అంకంలో ఆఖరున వచ్చే వేంకటేశ్వరుని పాత్రను తీసివేసి, తెరవెనుక నుంచీ ఆ మాటలు చెప్పించవచ్చును.



దాసుల వేషం ఈ చిత్రంలోని విధంగా వుండాలి.
శ్రీనివాసనాయకుడు, బ్రాహ్మణుడు, బ్రాహ్మణబాలకుడు,
వరదుడు, రామాచార్యులు-వీరందరి నామాలుకూడా చిత్రంలో
వున్నవిధంగా వుండాలి.

# భక్త పురందరదాసు (నాటకము)

## -: నాంది :-

**రాగం : ముఖారి** **తాళం : చాపు**

శ్రీపతియు నమగె సంపదవీయలి, వా
ణీపతియు నమగె దీర్ఘాయు కొడలి ॥ప॥

వరవిబుధరను పొరెయె విషవకంఠదలిట్ట
హర నిత్య నమగె సహాయకనాగలి
వరరొళున్నతవాద నిత్యభోగంగళను
పురుహూత పూర్ణమాడిసలి నమగె ॥1॥

విమల సిద్ధిప్రదను విఘ్నేశ దయదింద
నెనెదకార్యగళెల్ల నెరవేరిసలి
దినదినది ధన్వంత్రి అపత్తుగళ కళెదు
మనహరుషవిత్తు మన్నిసలి బిడదె ॥2॥

నిరుత సుజ్ఞానవను ఈవ మధ్వరాయ
గురుగళాశీర్వాద నమగాగలి
పురందరవిఠలన్న కరుణదిందలి సకల
సురరొలుమె నమగె సుస్థిరవాగలి ॥3॥

## ప్రస్తావన

[తెర తొలగినది. నటి ఆనందముగా నృత్యము గావించుచు ప్రవేశించినది.]

### పాట

రాగం : సౌరాష్ట్ర తాళం : అట

యారె బందవరు మనెగె మత్యారె బందవరు ॥ ప ॥

నారాయణ కృష్ణనాథ నల్లదె బేరే ॥ అ.ప ॥

వజ్రరేఖెగళివె మనెయల్లి కాల
గెజ్జెయ ధ్వని కేళిబరుతిదె
వజ్రమాణిక్యవెల్ల హరిదు బిద్దివె
మజ్జిగె యొళగె బెణ్ణెయకాణె ॥ 1 ॥

కొంబు కొళలు రథసగళివె క
దంబకస్తూరి పెంపెసెదివె
తొంబట్టె చల్లణ చెల్లిదె హాలు
కుంభ వడెద్దు మనెతుంబ బెళ్ళగాయితు ॥ 2 ॥

మించుహొళెదంతె హొళెయుత తన్న
సంచరరొడగూడి చలిసుతలి
వంచిసి బెణ్ణెయ మెల్లువ నమ్మ
లంచద పురందరవిఠల నల్లదె బేరె ॥ 3 ॥

—: ఇది నాంది :—

[అనంతరము సూత్రధారుడు ప్రవేశించి]

సూత్ర: అహో! అహో! మధురం! మధురాతిమధురం! నేత్రపర్వం! ఆర్యే! ఆ అమరకృతులకు అత్యంత మనోహరమగు రూప కల్పన మొనరించితివి. నీకు మంగళమగు గాక! ఈ అద్భుత నృత్యహేలకు, అమందానందమునకు కారణమేమి?

నటి : ఈ మంగళకృతులలో గల పవిత్ర మధురభావనయే నన్ను మురిపించి మైమరపించినది.

సూత్ర: అవును! పురందరదాసుల వారి కీర్తనలనిన సామాన్యమా? భావ, రాగ, తాళ, భక్తితత్త్వ సమ్మిళిత రసఝరులు, నాద నర్తనలు.

నటి : ఆర్యా! ఈ పురందరదాసుల వారెవ్వరు?

సూత్ర: ఏమి? దాసులవారినే యెరుగవా?

శ్లో॥ నారదో విష్ణుసేవార్థం వాయోరావేశతో ఒజని
పురందర యితిఖ్యాతో తత్వమార్గం ప్రదర్శయన్.

ఆర్యే! ఈ పురందరదాసుడు సాక్షాత్తు బ్రహ్మమానసపుత్రుడైన నారదుని యవతారమే! పరమాత్మునాజ్ఞను శిరసావహించి పండరీపురమునకు సమీపమందలి 'పురందరగడ' మనెడు గ్రామమున సద్బ్రాహ్మణుడును, కోటీశ్వరుడును అగు వరదప్పనాయకుని కుమారుడై 'శ్రీనివాసనాయకు' డను పేర జనియించి సిరిని తనగృహమునందే కట్టివైచి పిల్లికి సైతము భిక్షము పెట్టని పరమలోభి యని పేరు పొందెను.

నటి : లోభియా? చిత్రముగ నున్నదే!

సూత్ర: చిత్రమేమరి! జ్ఞానుల యవతారరహస్యముల తెలిసికొనుట యంత సులభముగాదు. వారి చరితలవెనుక యేదో కానరాని ప్రారబ్ధప్రక్షాళన హేతువు చోటుచేసికొని యుండును. ఆర్యే! ఆ స్వామి సంకల్పములు, సంఘటనములు బహుచిత్రములుగ

నుందును. ఇంతపరమలోభియగు నాయకునకు దానధర్మము లందు ఆసక్తిగల సాధ్వీలలామను సహధర్మచారిణిగా నొనర్చి ఆ హరి తన నాటకమునకు నాందీప్రస్తావనా నిర్మాణము గావించుకొని, అలనాడు వామనుడై బలిని యాచించినట్లు బ్రహ్మను కుమారునిగ జేసికొని వృద్ధబ్రాహ్మణ వేషధారియై శ్రీనివాసనాయకుని యాచింప వచ్చినాడు.

నటి : ఆహా! ఆర్యా! మీ రా యుత్తమోదంత మొకింత తెలిపినంతనే నా తనువు పులకాంకిత మగుచున్నదే! ఈ చరితము నాటక రూపమున మనమేల ప్రదర్శించరాదు?

సూత్ర: ఆర్యే! లెస్సగా పలికితివి! మన నటీనటులును ఈ ప్రయోగమునం దిప్పటికే సుశిక్షితులై యున్నారు. ఈ దినమే సుదినము. భక్తిని పెంపొందింపజేసి, ఆధ్యాత్మిక చింతనను ప్రబోధించు నా మహితాత్ముని పవిత్రచరిత్రమును కన్నడ భాషయందు శ్రీమాన్ అప్పణ్ణాచార్యులవారు రచియింప, అద్దానిని తెనుగున శ్రీవేదవ్యాస శ్రీరంగరాజ సుదర్శనభట్టరాచార్యు డనువదించియున్నాడు. అద్దానిని ప్రదర్శించి జన్మ సార్థకము జేసికొందము.

[అంత నేపథ్యమున 'మంగళం మంగళం శ్రీతులసీదేవికి మంగళం బృందావనాదేవికి' అన్న గీతము వినిపించినది.]

నటి : ఏమి? మంగళమని వినబడుచున్నది. నాటక మారంభింపనే లేదు గదా! మన కుశీలవులపుడే మంగళము పాడుచున్నారే!

సూత్ర: [తెరలోనికిచూచి] అది మన నటీనటులు జేయు మంగళము కాదు. అదిగో శ్రీనివాసనాయకుని సహధర్మచారిణి తులసి పూజ చేయుచూ మంగళహారతి గావించుచున్నది. పద, పోవుదము!

నటి : ఆఁ! అటులే! [ఇద్దరూ నిష్క్రమింతురు]

—: ఇది ప్రస్తావన :—

# ప్రథమాంకము

[శ్రీనివాసనాయకుని గృహము. ఒకప్రక్క తెల్లని పరుపు. దానికి వెనుకవైపున రెండు తలగడలు. లెక్కలు వ్రాసుకొను బల్ల. ఆ బల్లపై కొన్ని లెక్కల పుస్తకములు, ప్రక్కనే ద్రావకపుసీసా, ఒక త్రాసు ఉచితరీతిని అలంకరింపబడి యున్నవి. గోడలకు కొన్నిచిత్ర పటము లున్నవి.

ఇంటికి మధ్యగా తులసీబృందావనము సకలశోభలతో నల రారుచున్నది. రెండు పెద్దదీపస్తంభములు, పళ్ళెరములో పూజాద్రవ్య ములు, కొట్టబడిన నారికేళము, ఒక చెంబు, ఇతర పూజాసాధనము లున్నవి.]

— యవనిక తొలగినది —

సరస్వతీబాయి బృందావనమునకు 'హారతి' యొనరించుచు—

రాగం: నాదనామక్రియ తాళం: ఛాపు

మంగళం శ్రీతుళసిదేవిగె
జయమంగళం వృందావనదేవిగె ॥ప॥

నోడిదమాత్రక్కె దోషసంహారిగె
బేడిద వరగళ కొడువవళిగె
మాడె వందనెయను మనుజరపావద
గూడ నీడాడువ గుణవంతెగె ॥1॥

ముట్టిదమాత్రక్కె ముక్తర మాడువ
ముదదిందుద్ధరిసువ మునివంద్యగె
కొట్టరె నీరను బేరిగె కాలవ
ముట్టలీసద హొగె మాళ్పళిగె ॥2॥

పరసిజనాభవ పలిగెయు రాణిగె
శరణజవర హొరెవ పద్మిణిగె
తిరుపతినిలయ శ్రీపురందరవిఠల
చరణసేవకళాద చిన్మయిగె ॥ 3 ॥

శ్లో॥ యా దృష్టా నిఖిలాఘసంఘశమనీ స్పృష్టావపుః పావనీ
రోగాణామభివందితా నిరసనీ సిక్తాంతకత్రాసినీ
ప్రత్యాసత్తి విధాయినీ భగవతః కృష్ణస్య సంరోపితా
న్యస్తా తచ్చరణే విముక్తిఫలదా తస్యై తులస్యై నమః.

[అక్షతలు వేసి]

శ్లో॥ తులసీ శ్రీసఖీ శుభే పాపహారిణీ పుణ్యదీ,
నమస్తే నారదనుతే నారాయణ మనః ప్రియే.

[పుష్పములు వేసి నమస్కరించుచు, ప్రదక్షిణ మాచరించుచు]

శ్లో॥ యాని కాని చ పాపాని జన్మాంతర కృతాని చ,
తాని తాని వినశ్యంతి ప్రదక్షిణపదేపదే.

[ఉపవిశ్యయై]

శ్లో॥ అపరాధ సహస్రాణి క్రియంతే ఒహర్నిశం మయా,
తాని సర్వాణి మే దేవి క్షమస్వ హరివల్లభే.

[నీరు చేతియందు పోసికొని వదలుచు]

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్,
కరోమి యద్యచ్చకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.
శ్రీకృష్ణార్పణమస్తు .... .... .... ....

శ్రీనివాసనాయకుడు [ప్రవేశించి] సరస్వతీ!

నర :- [సంతోషముతో అక్షత లతనికిచ్చి] స్వామీ! సరియగు సమయమునకే విచ్చేసితిరి! ఆశీర్వదింపుడు. [నమస్కరించినది]

శ్రీని :- ఏమని యాశీర్వదింపమందువు? ఇంకనూ అనేక దానధర్మములు గావించుచుండుమనియా?

నర : మీ ఆజ్ఞపొందియే గదా, ఈ వ్రత మాచరించుచుంటిని?

శ్రీని : ఆఁ! ఆఁ! పొందితివి, పొందితివి! తులసీపూజయే కదా ఖర్చేమి యుండుననుకొంటిని. దంపతుల పూజలు, దానములు ధర్మములు, ఒకటియా, రెండా, దిక్షా-దివాణమా! ఈదినము నీ సుపుత్రుడు వరదుడు లెక్కలు చూపిన తదుపరిగదా తెలిసినది! నీవిట్టి వ్రతములు మఱి నాలుగు జేసిన చాలును, తల కొక జోలె పట్టవలసినదియే!

నర : అటులనకుడు. భగవంతు డొసగినపు డీయకున్న, లేనపుడీయ గలమా?

శ్రీని : ఇందు భగవంతు డొసగిన దేమున్నది? మా తాతముత్తాతలు మా తండ్రిగారు, నేను అహర్నిశలు శ్రమించి, చెమటోడ్చి యీ ఆస్థి సంపాదించితిమి!

నర : దానధర్మముల కుపయోగపడని ధనమెంతయున్నను దండుగయే కదా! ఇప్పు డొనరించిన సత్కార్యములే సద్గతులకు 'చద్దిమూటలు' కాగలవని సాధుసజ్జనుల సద్వాక్కు స్వామీ!

శ్రీని : ఆఁ! సన్నాసుల 'వాక్కు'ల కేమిలే? వాని నాచరించినచో మనకు మిగులునది బూడిదయే! చూడు సరస్వతీ! ఈ ప్రపంచమున ధనము గలవాడే ఘనుడు, ఉన్నతుడు-ఉత్తముడు-ఉద్దండుడు-అన్నియును. అది లేనట్టివాడే అల్పుడు-నీచుడు-అధముడు. ఆ సిరిగరిమ అహరహమవిరళకృషి గావించి యార్జించిన వానికే అవగాహన మగును.

నర: తమకు తెలుపునంతటి దానను గాను! ధనము వెంట రాదు. కంటక గాయదు, ఇహపరముల కాలవాల మా హరికృపయే! భాగవతాది ప్రామాణిక పురాణములందే గాక మరే మహాత్ముని చరిత్ర జూచినా, యీ సంపత్ప్రపంచమునకు, ఆ సత్పురుషునకు సంపూర్ణమగు తెగ్రతెంపులే కనబడును. బలిచక్రవర్తి తన సర్వస్వమును సర్వేశునకు సమర్పించి శాశ్వతకీర్తి బడసినాడు. కడకు బడుగువారలగు గోపికలు కూడ తమకడ గలవన్నియునూ, పుండరీకాక్షున కర్పించి ఇహపరముల రెండింటినీ పొందలేదా?

శ్రీని: అయినదా నీ యుపన్యాసము? సరస్వతీ! యీ హరికథలు నేనును చెప్పగలను. తలమునుకలు జేసికొని తల్లక్రిందులై తెచ్చువానికి తెలియును గాని తీరికగా తిని 'త్రేవ్'మని త్రేపువాళ్ళ కేమి తెలయును?

నర: స్వామీ! నే ననునది .... ...

శ్రీని: నీ వనునది_నేను వినునది ఇక చాలును! నీ యుపదేశములు కట్టిపెట్టుము. ఇంతవరకు నా కుపదేశములు చేయుచున్నవా డా బ్రాహ్మణు డొక్కడే యనుకొంటిని! నీవును మొదలిడితి వన్నమాట!

నర: బ్రాహ్మణుడా! మీ కుపదేశములు నలుపుచున్నాడా! ఎవరు స్వామీ! వా రెచ్చట నుందురు?

శ్రీని: అయన నాహ్వానించి, యుపచారములు చేసి యుపన్యాసము లిప్పించెదవా యేమి?

నర: అంత భాగ్యమా?

శ్రీని: నీ వాలకము చూచిన నన్నతికాలముననే దానరిని జేయు నటు లున్నావు. సరి సరి! ఆ భీమన్నగాడేమైన వడ్డీపైకము కట్టి వెళ్ళినాడా!

సర: అవును. తెమ్మందురా?

శ్రీని: ఊఁ!

[సరస్వతి లోనికి వెడలి, వెంటనే పైకముతో ప్రవేశించి, నాయకున కిచ్చి, అత డొకమారు లెక్క వేసికొని మరల లెక్కవేయ బోవుచుండగా]

సర: స్వా....మీ....

శ్రీని: ఏమీ?

సర: పాపము, భీమన్న పెక్కు ఇబ్బందులలో నున్నాడట. భార్య కేదియో జబ్బు చేసినదట. ఈ పరిస్థితిలో మీరువేసిన వడ్డీ మఱీ బరువుగా నున్నదట. కనుక ....

శ్రీని: కనుక?_

సర: వడ్డీ కొంత తగ్గించిన .... ....

శ్రీని: ఓహో! వాడు నిన్ను రాయబారములు చేయమన్నాడన్న మాట!

సర: అయ్యయ్యో! ఆ అమాయకు డేమియు ననలేదు. వాని దీన స్థితి జూచి నేనే వేడుకొనుచున్నాను. బాధలలో నున్నవారిపై మఱల బరువును మోపుట 'గోరుచుట్టుపై రోకటిపోటు' వంటి దియే కదా స్వామీ!

శ్రీని: సరస్వతీ! నీ సానుభూతులు సలహాలు నా కనవసరము. ఇకపై వ్యాపార విషయములలో తలదూర్చ ప్రయత్నములు జేసితివో జాగ్రత్త!

సర: నా మాటలవలన మీ మనస్సునకు కలత కలిగియున్న నన్ను మన్నింపుడు.

శ్రీని: ఆఁ ఆఁ!

[సరస్వతి ఇంటిలోని కేగి, శ్రీనివాసనాయకుడు మణుల తన. చేతనున్న పైకమును లెక్కించుచుండగా బిందెతో ప్రవేశించినది.]

సర: స్వామీ! నేను నీటికై ఏటికి పోయి వచ్చెదను.

శ్రీని: ఊఁ! త్వరితముగ రమ్ము!

[సరస్వతి సరే యనునట్లు తల యూపుచు నిష్క్రమించినది. శ్రీనివాసనాయకుడు మణుల లెక్కవేయ దొడగినాడు. ఇంతలోవృద్ధ బ్రాహ్మణ వేషధారియగు శ్రీహరి; బ్రహ్మ నెనిమిదేండ్ల బాలకునిగా జేసికొని ప్రవేశించినాడు.]

బ్రాహ్మ: శ్రీనివాసనాయకులకు శతమానం భవతి శతాయుః ....

శ్రీని: ఆఁ ఆఁ! ఏమయ్యా బ్రాహ్మణుడా! చెప్పక, చేయక ఇంటు దూరుటయేనా! ఎంత ధైర్యము?

బ్రాహ్మ: అదేమి నాయకా! నేను రావలసిన చోటునకే వచ్చితిని.

శ్రీని: ఏమి? నీవు రావలసిన చోటేనా .... ....

బ్రాహ్మ: కాదా? రవంత యపార్థము గావించుకొనక ఆలోచనచేయి నాయకా! బ్రాహ్మణునకు గృహస్థులు స్వాగతము పలికి, యుత్తమ స్థానములయం దాసీనుల గావించి, పూజించి, తైం కర్యములు జేసికొనవలెను గదా! న న్నచ్చటనుండి ఆహ్వా నించి, ఆదరించి, అర్పించి, అర్పించుకొను శ్రమ యెందుల కని, నేనే సరాసరి లోని కరుదెంచితిని. (బాలునితో) తప్పా నాయనా?

బాల: తప్పేమున్నది? ఒప్పే నాయనా!

శ్రీని: భలేవారలే! చమత్కృతులు కూడానా! అది సరేనయ్యా! మూడు మాసములనుండి పొద్దు-మాపు తిరుగుచునేయున్నావే. నీ కలుపూ సొలుపూ లేదా?

బ్రాహ్మ: అలుపు-సొలుపా? (నవ్వి) అట్టివి నాకు లేవు. నాకు కావలసిన వారిచుట్టు తిరుగుటకు, వారిని యాచించుటకు నేనెప్పుడూ విసుగుకొనను. నీవూ .... నా వాడవే కదా! (బాలునితో) ఏమి నాయనా!

బాల: అవును నాయనా!

శ్రీని: నేను నీవాడినా? ఇది ఎప్పటినుండి?

బ్రాహ్మ: నీవు రమ్మని పిలుచుచున్నప్పటినుండి,

శ్రీని: నేను నిన్నురమ్మని పిలుచుచుంటినా! కంటబడినంతనే పోయి రమ్మని వెంటబడి తరుముచుంటిని.

బ్రాహ్మ: అదే నాయనా! పోయి - రమ్మని యనుచున్నావనియే మరల మరల వచ్చుచున్నది. (బాలకునితో) ఏమినాయనా?

బాల: అంతేకదా నాయనా,

శ్రీని: కర్మ! కర్మ!

బాల: అవునవును!

శ్రీని; ఆఁ!

బ్రాహ్మ: ఆఁ! ఆ దుష్కర్మ పరిహరింపబడ వలెనన్న, యిట్టి సత్కార్యములకు సాయము చేసియే తీరవలయును. నే నెన్నియో మార్గ తెలుపుకొంటిని. నా కుమారునకు 'ఉపనయనము' గావింపవలయును. నా ముద్దుబిడ్డ డింకనూ జ్ఞానకార్యమున

కనర్హులై తపించుచున్నాడు. అజ్ఞానాత్మకమగు తొలిజన్మనుండి జ్ఞానపూర్ణమగు 'మలి'జన్మ మీయవలసి యున్నది. అందులకే నా ఈ ప్రయత్నము, తాపత్రయము!

శ్రీని: అయ్యో! చూచుచుండిన ఉపనయనము నీ కొడుకునకు గాదు, నాకే జేయునట్లున్నావు! నీ సోదె ఇంకెవరికైన నూదిన ప్రయోజన ముండవచ్చును.

బ్రాహ్మ: నాయకా! నా వారికి తప్పా ....

బాల: వేరెవరికీ చెప్పరు!

శ్రీని: తండ్రి కొడుకులిద్దరును సరిజోడుగ నున్నారు. అసలొక్క విషయము. ఈ యూరికంతటికినీ నే నొక్కడినే దానధర్మములు జేయుదునని కంకణము గట్టికొనినట్లు మీకు కనిపించిలినా యేమి? అన్యప్రయత్నములు జేసియున్న నీ కొడుకున కుపనయన మేనాడో జరిగియుండెడిది. నీ మొండితన మదేమియో గానీ నన్ను వదలిపెట్టునట్లు లేవు.

బ్రాహ్మ: ఎప్పటికినీ వదిలిపెట్టను. ముఖ్యముగా ఉపనయనమనివచ్చి తొలుత యాచించినది నిన్నే. ప్రథమ విఘ్నము కారాదవి.... అందులకే పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో, తృణమో పణమో ఏదోయొకటి నీనుండి అందిననే నేను తృప్తిజెందెదను. ఇదినానిశ్చల నిశ్చయము. (బాలునితో) ఏమినాయనా?

బాల : అంతేనాయనా!

శ్రీని : నానుండి యేదో యొకటి పొందవలెను–అంతేకదా!

బ్రాహ్మ: అంతియే! అంతియే!

శ్రీని : నేనభిమానముతో నిచ్చిన దేదైనను మారుమాటాడక పుచ్చుకొని వచ్చిన దారిని వెడలవలెను సుమా!

బ్రాహ్మ: అహాః! తప్పక! అభిమాన మంటివికదా! అదియొక్కటి యుండిన చాలును. నాయకా! ఈ హస్తము ...

బాల : సామాన్యమైనది కాదు నాయనా!

శ్రీని : అవునవును. కనబడుచునేయున్నది! [లోనికిపోయి ఒక తుప్పుపట్టిన కాసుతెచ్చి] ఇదిగో!

బ్రాహ్మ: నాయకుడా! ఒకసారి "కృష్ణార్పణ" మని.........

శ్రీని : సరిసరి! కృష్ణార్పణమస్తు.

(బ్రాహ్మణునిచేత కాసు వేసినాడు. బ్రాహ్మణుడా కాసును చేతగిచి, వస్త్రముతో తుడిచి పరీక్షించుచున్నాడు)

పుణ్యమున కిచ్చిన దానిని పట్టిపట్టి పరీక్షించుట కూడానా?

బ్రాహ్మ: చూడు నాయనా! నాచేతి కందిన దాని మాలిన్యము తొలగించుట నా కర్తవ్యముకదా! ఈ చిల్లికాసునకు బాగా త్రుప్పు పట్టినది. అందులకే వదలించుచున్నాను.

శ్రీని : సరిసరి! నాకు బోలెడు పనియున్నది. నీ వదలించు పని నావల గావించుకొనుము.

బ్రాహ్మ: అటులే నాయనా! నీకు మంగళమగు గాక!

బాల : నీకు శుభమగు గాక!

[ఆశీర్వదించుచూ నిష్క్రమించినారు. అంతలో సరస్వతి బిందెతో ప్రవేశించినది.]

శ్రీని : అమ్మ! మూడు నెలలనుండి పట్టిన యీ బ్రాహ్మణుని బిడ్డు విరుగడైనది.

సర : ఎవరు స్వామీ? [బిందె మూలదించినది.]

శ్రీని : ఎవరా ? నీవు గాక యీ యూర నాయెదుట నిలచి యుప దేశములు గావించు బ్రాహ్మణోత్తముడున్నాడని యంటివే.... వాడు! గుళ్ళు, గోపురములు కట్టించవలెనట! చెఱువులు, బావులు త్రవ్వించవలెనట! సత్రములట – సంతర్పణలట, సత్కార్యములట. ఆ యుపదేశములకొక యంతు పొంతేమైన నున్నదా! వినివిని చెవులు చిల్లులుపడినవి. చిట్టచివరకెట్టులో వదిలించుకొంటిని.

నర : అయ్యో! వారిదర్శనమునైనను గావించుకొనలేక పోయితినే!

శ్రీని : ఆఁ! దర్శనములు, దండములు, దక్షిణలు, దండుగలు అన్నియు నైనవి.

నర : మీరు దక్షిణ యొసగితిరా! చాలా సంతోషము స్వామీ! ఈ దినము జన్మధన్యమైనది. ఆ స్వామి మీచేత ఒక్కమారైనను ఒక్క సద్బ్రాహ్మణునకు దాన మొసగునట్లు జేసినాడు! అంతియే చాలును.... స్వామీ! అనలానసర్వాంతర్యామి....

శ్రీని : ఉపన్యాసమా ? ఇంత చాలును. ఈ దినమేలనో అన్నిటికి అదియొక మాదిరిగ మాటలాడుచున్నావు. ఈ దానధర్మముల వెఱ్ఱి తగ్గించుకొనుము. లేకున్న అనర్థములు సంభవింప వచ్చును. తెలిసినదా ? ఆఁ! నేను అంగడికి వెళ్ళవలయును! తలుపులు జాగ్రత్త! ఈ నడుమ నటునట దొంగతనములు జరుగు చున్నవట!

నర : అటులే! పోయి రండు.

శ్రీని : జాగ్రత్త! జాగ్రత్త!

[హెచ్చరించుచు నిష్క్రమించినాడు.]

నర : ప్రభో! ఈ దానమొసగు జ్ఞానమే వారికి నిరంతరము కలుగ జేసి, కరుణించి కాపాడుము. వారి లోభమును తొలగింపుము. నీవు గాక ఎవ్వ రుద్ధరింతురు? పరమపాపులను అజామిళ, మాధవాదులనే పరిరక్షించితివే! తండ్రీ! నా స్వామి పరముగ నేను మొరలిడు చున్నాను. వారి మనసును మలినరహిత మొనర్చి మార్చగలిగినది నీవే తండ్రీ-నీవే!

[బ్రాహ్మణ, బాలకులు మణల ప్రవేశింతురు.]

బ్రాహ్మ: అమ్మా!

(సరస్వతి ఆనందముతో జూచి, వచ్చి నమస్కరించినది.)

దీర్ఘసుమంగళీభవ! శీఘ్రమేవ మనోవాంఛా సిద్ధిరస్తు!

నర : దయచేయుడు! [పీటలు వేయుచూ] సుఖాసీనులు కండు!

బ్రాహ్మ: అమ్మా! నాకొడుకు వడుగునకు సాయమడుగ నీకడ కేగు దెంచితిని. అత్యవసరమగు నద్దాని నడుగమందు వేని యడిగె దను.

నర : కొంతకాలముగా మావారికడ కేతెంచుచున్నది....

బ్రాహ్మ: ఆc! నేనే తల్లీ!

నర : ఆc! వారు మీకు దక్షిణ యొసగిరట....

బ్రాహ్మ: ఆc! ఒసగినాడు తల్లీ!

బాల : మూడునెలలు ముప్పటులూ కాళ్ళరిగునట్లు తిరిగి యుప దేశములు చేసినందుల కొక చెల్లని చిల్లికాసు!

[సరస్వతి బాధగా తలవంచుకొనినది.]

బ్రాహ్మ: ఫరవాలేదులే తల్లీ! బాధపడకు! అతనినుండి యేదియో యొకటి తీసికొనవలెనని సంకల్పించియుంటిని-తీసికొంటిని.

నీ వాతని సహధర్మచారిణివి! నీ ధర్మము కూడా కలసిననే కార్యము సంపూర్ణముగ నెరవేరగలదు.

నర: స్వామీ! మీ దర్శన మాత్రమున మహానందము గలుగు చున్నది. సాక్షాత్తు సర్వోత్తముడే మా గృహమున సాక్షాత్క రించినటుల అనుభూతి పొడముచున్నది. అర్పించుటకు నే నసమర్థురాలను. అర్యులే మార్గము జూపి జన్మ ధన్యము గావింపవలయును.

బ్రాహ్మ: చాలయుక్తముగ బలికితివి తల్లీ! ముక్తికి వెలకట్టదగిన దగు నీముక్కరను దానముగా నిచ్చిన చాలును.

నర: అజ్ఞ! (ముక్కరతీసి) భవహరా! అన్నియును భవదీయ లీలా విశేషములే! ఈ క్షణమునం దీ బుద్ధినొసగి యీ సత్కార్యము చేయించువాడవు నీవే! నీ పదపద్మములకే సర్వస్వమర్పణము శ్రీకృష్ణార్పణమస్తు. (బ్రాహ్మణున కిచ్చినది.)

బ్రాహ్మ: సంప్రీతుడనైతిని. శుభమస్తు! నీ కోరిక త్వరితముగనే నెరవేరగలదు. అర్థవంతమగు నీ దాన మెన్నటికినీ వ్యర్థము గాదు.

నర: అంతయును మీ దయ!

బ్రాహ్మ: అం! తల్లీ! మఱొక్క కోరిక మాత్రము గలదు, అదియునూ తీర్చెదనన్ననే తెలిపెదను

నర: అజ్ఞాపింపుడు స్వామీ!

బ్రాహ్మ: నాయొద్ద అక్షయపాత్ర, తంబుర, చిరుతలును గలవు. నేనా, ఒకచోట నుండెడివాడను గాను. అన్ని ప్రదేశములు తిరుగుచూ, అనేకులతో సంబంధములు పెట్టుకొనుచుండు వాడను. నాకెన్నియో పనులు. ఒకవిధముగా నేను విశ్వ

కుటుంబిననియే యనుకొనుము తల్లీ! వానిని మోయుచు తిరుగవలెనన్న భారముగ నున్నది. వానిని నీకడ జాగ్రత్తగా దాచియుంచిన కడు సాయ మొనర్చిన దానవగుదువు.

బాల: ఆ సాయము మాత్రము తప్పక చేయుము తల్లీ! వానిని మోయలేక నా తలప్రాణము తోకకు వచ్చుచున్నది.

సర: మహాభాగ్యము స్వామీ! నా పాలిట నిక్షేపముగా కాపాడు దానను.

బ్రాహ్మ: సంతోషము తల్లీ! హిరణ్యగర్భా! వానిని తీసికొని రమ్ము నాయనా!

బాల: ఆజ్ఞ నాయనా!

[నిష్క్రమించును]

సర: వేరెచ్చటనైనను పెట్టితిరా స్వామీ?

బ్రాహ్మ: లేదమ్మా లేదు! అవి యనవతరము మాకడనేయుండును. ఇప్పు డా వసారాయందు పెట్టివచ్చితిమి. అవిగో, బాలకుడు తీసికొనివచ్చుచున్నాడు.

[బాలకుడు తంబుర, అక్షయపాత్ర, చిరుతలతో ప్రవేశించి నాడు. బ్రాహ్మణుడు సరస్వతి కిమ్మని సైగచేయ ఆమెకు వాని నంద జేసినాడు]

బ్రాహ్మ: అమ్మా! ఇవి నా కత్యంత ప్రీతిపాత్రములు. కడుంగడు జాగ్రత్తగా కాపాడవలయు సుమా! ఆ....తల్లీ, అవసరమైన యెడల మీరు వానిని నిరాటంకముగా వాడుకొనవచ్చును. నా కే మాత్ర మభ్యంతరము లేదు!

సర: ఆ సౌభాగ్యము మా కున్నదా! ఏమైనను మీ యాజ్ఞ ననుస రించుదానను.

బ్రాహ్మ: మంచిది తల్లీ! మిక్కిలి మక్కువతో, నీ వొసగిన ముక్క రతో తీరవలసిన అక్కరలు తీర్చుకొని అవసరమైనచో మరల నరుదెంచగలవారము.

[సరస్వతి పాదాభివందనము గావించినది.]

బ్రాహ్మ: శుభమస్తు!

[వారిద్దరును నిష్క్రమించుచుండ సరస్వతి వారి వైపునకే చూచుచుండగా]

—: తెర :—

ఇది ప్రథమాంకము.

# ద్వితీయాంకము

## (అదీ రంగస్థలాలంకరణము)

[తెర లేచునరికి వీధినుండి శ్రీనివాసనాయకుడు ఏదియో ఆలోచన చేయుచు ప్రవేశించి అటునిటు చూచుచూ, తిరుగుచూ తన మొలనున్న రత్నపేటికతీసి అందున్న ముక్కరగొని బాగుగాచూచి]

శ్రీని: నిస్సంశయముగ నిది సరస్వతి ముక్కరయే! ఇదిగాక యింతటి విలువైన వజ్రముగల ముక్కర ఈ ప్రాంతములో మరి యొకటి లేదనుట నిస్సందేహము. ఇది యా ముసలివాని చేతి కెట్లు వచ్చియుండును?

[ముక్కర పేటికయందుంచి మొలలో దోపుకొనుచు]

దొంగిలించియుండును. ఆ వృద్ధు డింతటివాడని కలనైన నూహింపలేదు. ఆ వేషము, ఆ మాటలు, ఆ ముఖకవళికలు, ఆ రూపురేఖలు అంతయు నటన! పుత్రుని ఉపనయనమట! నా సాయ మత్యవసరమట! నన్ను ఉద్ధరింప వచ్చెనట! తన వారినితప్ప వేరెవరినీ యాచింపడట! ఎన్ని మాయమాట లాడినాడు! నాకడ ఆటలు సాగలేదని నా యిల్లుజొచ్చి సరస్వతి యే పెరటిలోనో యున్నప్పుడు ముక్కర దొంగిలించి నాడు! దొంగ! పచ్చిదొంగ! నా యింట దొంగిలించినది నాకే అమ్మవచ్చినాడు! ఓరీ! బ్రాహ్మణబ్రువా! ఎంత దూర మేగెదవో చూచెదగాక! (ఆలోచించి) అయినను నా వెఱ్ఱిగాని ఎంత వెఱ్ఱివాడైనను ఎవరి వస్తువును దొంగలించెనో, అద్దానిని వారికే అమ్మవచ్చునా? ఊహుఁ! ఆ బ్రాహ్మణుని బూటకపు

మాటలకు అపురూపమువోలె కనపడు రూపమునకు, ఆ మునలి వానిని పరమాత్మస్వరూపు డనియే యెంచుచు నీ వెఱ్ఱిబాగుల సరస్వతి దానమొసగి యుండదుకదా! ఏమో! అయియుండ వచ్చును. సరస్వతీ! నీ దానబుద్ధి ఇంత వృద్ధియగుచున్నదా? దీని పరిణామ మెట్లుంటునో పరికించెదవు గాక! సరస్వతీ! సరస్వతీ!

సర: (భయముతో ముఖము దాచుకొనుచు ప్రవేశించి) పిలిచితిరా?

శ్రీని: (పరీక్షగా ఆమెనే చూచుచున్నాడు.)

సర: కాళ్ళు కడుగుకొనుటకు నీరు తెచ్చెదను.

శ్రీని: నిలువుము! నీ రవసరము లేదు. ఏమీ, ఆ మోము మేము దర్శింపరాదనియా దాచుకొనుచున్నావు?

సర; (భయముతో అతనివైపు తిరిగినది.)

శ్రీని: ఓహో! ఈ దినము తలంటిపోసికొనినావు గదా! తలంటిపోసి కొనునపుడెల్లా ఆభరణము లన్నియును తీసిపెట్టెడిదానవుకదా నేడేమి, ఒక్కముక్కర మాత్రము తీసిపెట్టినట్లున్నావు? ఓహో మఱల పెట్టుకొనుట మఱచితివేమో! ఏదీ! ఆ ముక్కరనొక్క మారు తెమ్ము. అవసరముగా పరికింపవలసి యున్నది.

సర: (తనలో) పరంధామా! ఏమీ పరీక్ష? (ప్రకాశముగా) స్వామీ....

శ్రీని: ఏమీ?

సర: ఈ దినము పెందలకడనే వచ్చితిరి. వంటయునైనది. నాకును ఆకలిగ నున్నది. మడికట్టుకొనుడు. భోజనము చేసి........

శ్రీని: సరస్వతీ! నీయెదుట నిలబడినవాడు శ్రీనివాసనాయకుడు!!! మాటలు మార్చు వ్యర్థప్రయత్నములు గావించక వేగమే తెమ్ము!

నర : అదియా! ....అది దేవుని కడనే....

శ్రీని : నీవు మడిగానే యున్నావుకదా! మరేల తేవు?

నర : నాథా! ఈ దినమేల యింత ఆగ్రహము వహించియున్నారు?

శ్రీని : సరస్వతీ! నా విషయము నీకు పూర్తిగా గురుతే యనుకొందును. సంపద్విషయమున నన్నేమార్చ జూచిన మాత్రము నే నోర్చుకొనజాలను. ఎక్కడ ఆ ముక్కర? ఇప్పుడే, ఈ క్షణమే అది నాచేత నుండవలెను!

[తెరలో.... అయ్యా! అయ్యవారూ....]

శ్రీని : ఆఁ ఎవడురా!

[తెరలో.... నేనయ్యా రంగన్నను .... తమకాడ తీసుకున్న అప్పు కట్టేదానికి వచ్చినానయ్యా....]

శ్రీని : ఆఁ ఆ! [లెక్కల పుస్తకము తీసుకొని] సరస్వతీ! నేను తిరిగి వచ్చునంతలో....

నర : స్వామీ! ఆగ్రహింపకుడు. నే చెప్పునది శాంతముగా....

శ్రీని : నీ ఉపదేశములు కట్టిపెట్టుము. ఈ విషయమున నామనస్సు కఠిన కర్కశపాషాణము. సరస్వతీ! నేను నీకు కావలయునని యున్న, నేను తిరిగి వచ్చునంతలో ముక్కర నాచేత నుండ వలయునన్నది జ్ఞప్తియందుంచుకొనుము. లేకున్న నేటితో నీకును నాకును ఋణము తీరినట్లే!

నర : [పాదముల వ్రాలి] మీ పాదములంటి ప్రార్థించెదను. దయచేసి అంతటిమాట లనకుడు.

శ్రీని : అదంతియే! [నిష్క్రమించును.]

నర : స్వామీ! నందనందనా! ఎందులకు నాకీపరీక్ష! ఏనాడును వినని కఠినమగు పలుకులు వారినోట నేడు వినవలసివచ్చినది. నీ పరీక్షలకు నిలువగల శక్తి నాకెక్కడిది? పుత్రుని ఉపనయన మని పుడమివేలుపు ముక్కర కోరుటయు, ముందు వెనుక లాలోచింపక నేనాతని కద్దానినొసగుటయు మాత్రాకాలమున జరిగినవి. ఆ ద్విజుని తేజస్సు, ప్రశాంత వీక్షణములు, పావన మగు పలుకులు తలచినంతనే తనువు భక్తిప్రపత్తులతో పుల కాంకితమగుచున్నది. విఠలుడే విచ్చేసి మాటలాడి నట్లనిపించు చున్నది. స్వామీ! భక్తవత్సలా! ఆర్తత్రాణ పరాయణా! ఈ సంకటస్థితినుండి యీ సమయమున నీవు కాక, సంరక్షణ జేయగలవారింకెవ్వరు?

అమర బెన్నట్టిబరె పశుపతియ రక్షిసిదె
ఋషియ శాపవ తరిదు అంబరీషనకాయ్దె
వసుధెయలి కల్లాగి బిద్ద అహల్యెయ పొరెదె, శిశుప్రహ్లాద నాలిదె
హసులె ధృవరాయంగె పెసరుప్పదవిత్తె
దశకంఠననుజంగె స్థిరపట్టవను కొట్టె
హెసరుగొండలె మగన అజామిళనరక్షిసిదె వసుదేవసుతనె సలహో!

కరివరదా! కావరావా! వారు విధించు శిక్షను నేను భరింప జాలను తండ్రీ! భరింపజాలను!

[తెరలో.... శ్రీనివాస నాయకుడు: నేను నీకు కావలయునని యున్న నేను తిరిగి వచ్చునంతలో ముక్కర నాచేతనుండవలె నన్నది జ్ఞప్తియందుంచుకొనుము. లేకున్న నేటితో నీకును నాకును ఋణము తీరినటులే.... ఋణము తీరినటులే! ఋణము తీరినటులే........]

లక్ష్మిమనోహరనె ఇక్షుచాపనపితనె
యక్షగంధర్వ అమరేంద్ర మునివందితనె

అక్షయనె అబదలి జగవ మోహిప స్థూల
సూక్ష్మదొళు పరిపూర్ణనే.
కుక్షియొళగిరేడుజగవ పాలిసుతిహనె
అక్షాసురాంతగె అజపదవ ఇత్తవనె
దక్షసుతెపతిసఖనె పక్షివాహన రక్షిసో అనాధబంధో
తందె తాయియు నీనె బంధుబళగవు నీనె
ఇందెన్న కులస్వామి గురు పితామహ నీనె
ఎందునంబిదె యెన్న మానాభిమానవ ము
కుందా నినగొప్పిసిదెనో!
కొందకొళతు కాయ్దుకొళతు దేవా....రక్షిసో....రక్షిసో....

కృపాకరా! కరుణించవా!.... అయినను నీవువచ్చి కాపాడ దగినంత భక్తి నాకడ నెక్కడిది? పిలిచిననూ రాలేదను అప ఖ్యాతి నావలన నీకేల కలుగవలెను? నా ప్రారబ్ధ మెట్లున్నదో యట్లేయగును. ముక్కర నా ఇవ్వజాలను. వారినోట అమంగళ వాక్యములు విని భరింపలేను. ఎట్టి పరిస్థితులలోను వారిని మెప్పించి ఒప్పించగల శక్తియూ నాకు లేదు. ఇక ప్రాణత్యాగము కన్న మార్గాంతరము గోచరించుటలేదు [ద్రావకపు సీసా తీసుకొని] స్వామీ! నా సర్వస్వము నీకు సమర్పితము. నా స్వామి పదసేవాభాగ్యము జన్మజన్మలకును ప్రసాదింపుము. వారిని మన్నించి, ఉద్ధరించి, నీ పదదాసునిగ జేసికొని పాలింపుము. ఇదియే నా తుది కోరిక.... నాథా! ఈ జన్మమునకు మీ సేవా భాగ్యమింతియే యని యున్నదేమో! నన్నింక మన్నింపుడు, నమోనమః.... నారాయణ.... నారాయణ.... నారాయణ!

[ద్రావకము త్రాగబోయినది. ఇంతలో అశరీరవాణి....] "సాధ్వీ! సంప్రీతుడనైతిని. ముక్కరధారవోసి ముక్తుడనగు నన్నేకొనినావు. ఇదిగో! ముక్తిని తులతూచిన నీ ముక్కర"

[పైనుండి ముక్కర ఆమె సమీపమున పడినది. దానిని తీసు కొని మహానందముతో కనులకద్దుకొనుచు) కృష్ణా! తండ్రీ! ఎంత కరుణామయుడవు! నీ భక్తవాత్సల్యమునకు మేరయే లేదు. మాకులదైవమా! అల్పులమగు మమ్ముద్ధరించితివా! కృష్ణా! కృష్ణా! కృష్ణా!

[శ్రీనివాసనాయకుడు ప్రవేశించినాడు. ఆమె అతని పాద ములపై బడి] స్వామీ! నేడు మనజన్మ ధన్యమైనది. స్వామి కరుణించినాడు.

శ్రీని : ఎవరా స్వామి?

సర : పతితజనోద్ధారకుడు. పరమకృపాకరుడు, పరాత్పరుడు, పరమపురుషుడు, ఆ పరమపదనాథుడే!

శ్రీని : బెల్లమున్నదా యనిన అల్లమున్నదనియెడి అర్థము లేని సమాధానముకాదు నాకు కావలసినది. నేనడిగినది ముక్కర! అదెక్కడ?

సర : ఆస్వామి కరుణించి ప్రసాదించిన ముక్కర ఇదిగో!

[శ్రీనివాసనాయకుడు ముక్కర చూచి, దిగ్భ్రాంతితో, తన పెటికతీసి, అందు ముక్కర గానక]

శ్రీని : ఆ! ఏమి యీ ఆశ్చర్యము! భ్రమకాదుగదా! స్వప్నము కాదుకదా! ఇంతకుక్రితమే బ్రాహ్మణుడమ్మటకు తెచ్చిన యీ ముక్కరను కని, యనుమానముతోడ అతనిని అంగడియెద్దనే నిలిపి స్వయముగా, భద్రముగా, ఈ ముక్కరను నా యొద్దనే యుంచుకొనియుంటిని. కానీ.... యిప్పుడు.... సరస్వతీ .... నా కంతయు అగమ్యగోచరముగ యున్నది. మతి భ్రమించి నటు లనిపించుచున్నది. దిక్కుతోచకున్నది సరస్వతీ! ఈ ముక్కర నీ చేతికెట్లు వచ్చినది? అసలేమి జరిగినది?

నర : స్వామీ నన్ను మన్నింతురా ?

శ్రీని : అబ్బా! మన్ననలు - దండనలు కాదు సరస్వతీ! జరిగిన దేమియో త్వరితముగ తెలుపుము!

నర : అట్ల స్వామీ! ఈ దినము మీ రంగడికి వెడలిన కొంత తడవునకు ఆ బ్రాహ్మణుడు బాలకునితో వేంచేసి పుత్రుని ఉపనయనమునకై ముక్కర దానమొసగుమని నన్నాజ్ఞాపించి నాడు. ఆస్వామి వర్చస్సు, వాక్కు, వాత్సల్యము లేమని చెప్పగలను స్వామీ! సాక్షాత్తు విఠలుడే యనిపించినది. మహానందానుభూతి కలిగినది. ఆ తన్మయస్థితిలో ముక్కరను వారికి సమర్పించితిని.

శ్రీని : మణి.... ఇప్పుడు అది మణుల నికడ కెట్లువచ్చినది?

నర : ఆ బ్రాహ్మణు డెవరో కాదు స్వామీ! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు. ఆద్యంతరహితుడు, ఆర్తత్రాణపరాయణుడునగు సాక్షాత్తు ఆ శ్రీమన్నారయణుడే! పాపాత్ములమగు మనల నుద్ధరింప పరమపదమునుండి పాదచారియై విచ్చేసి నాడు!

శ్రీని : (ఆశ్చర్యముతో) ఏమీ!

నర : అవునుస్వామీ! ఆగ్రహమున మీరనిన మాటలకు భయకంపితనై వేరుదారిగానక ద్రావకముద్రావి ప్రాణముల వీడ ప్రయత్నించుచుంటిని. అంతలో....

శ్రీని : అంతలో!

నర : ఆ భక్తబాంధవుడు, ఆ భవబంధహరుడు, ఆశ్రితవత్సలుడు మున్ను నేనెన్నడును వినసట్టి, ఈ చరాచరాత్మకమగు ప్రకృతి నంతటినీ పరవశమున ముంచెత్తగల, మధురమంజుల మనో

హర గంభీరవాచామగోచరమగు సుస్వరముతో, 'ప్రీతుడనైతి' నని పలికి, ఈ ముక్కర ననుగ్రహించినాడు. ఆ వచ్చిన విప్రవర్యుడు నిస్సందేహముగ మనల బ్రోవవచ్చిన విఠలుడే స్వామీ! విఠలుడే!

శ్రీని : [కన్నీరు కురియుచుండగా] సరస్వతీ! నీవెంతటి భాగ్యవతివి! నీజన్మమే ధన్యము. సరస్వతీ! నీవన్నది సత్యము. సందేహములేదు, ఆ బ్రాహ్మణుడు నా శ్రీహరియే! అజ్ఞానాంధకారమున కొట్టుమిట్టాడుచున్న నన్ను కాపాడ కదలివచ్చిన కరుణామూర్తియే! శ్రీహరీ! విఠలా! పాండురంగా! నన్ను పాలింప వచ్చితివా! అయ్యో! నిన్ను చీదరించితిని. తిట్టితిని. తిరుగగొట్టితిని. నీకై తిరుగవలసినవాడను నిన్నే నావెంట త్రిప్పుకొంటిని! కంటియెదుట నిలచి నడయాడిననూ గమనింపక గౌరవింపక మాటాడక అవమానించిన మహాపాపిని! జగన్నాథా! జగన్నాథా! నిన్ను దొంగయంటినికదా! నేనెంతటిపాపిని - నేనెంతటిపాపిని [తలబాదుకొనును]

సర : స్వామీ! చింతింపకుడు! ఆ స్వామి భక్తాపరాధసహిష్ణువు!

శ్రీని : అవును సరస్వతీ! ఆస్వామి నిజముగా దొంగయే! నాబోటి పాపులు, లోభులు, జన్మజన్మలుగా కూడబెట్టుకొనిన పాపపు మూటలను అపహరించు పెద్దదొంగ! సరస్వతీ! స్వామివిచ్చేసి నాతో యేమనినాడో తెలిసెనా!

సర : ఏమనినాడు స్వామీ!

శ్రీని : నాయకుడా! నావారిని తప్ప వేరెవరినీ నేను యాచించనని నాడు. అహో! స్వామీ! నేను నీవాడనా! ఏమి స్వామీ! నీ మృదు మధుర మనోహరములగు పలుకులలోని అంతరార్థములు! నీ అపార భక్తాపరాధసహిష్ణుతకు మేరలేదు. గద్ది

పోంచతో సమమగు నేనెక్కడ? సర్వాంతర్యామివైన నీవెక్కడ! నీ భక్తవాత్సల్యమును తెలుసుకొనలేకపోయితిని కదా! చేతి కందిన రత్నమును చేతులార పోగొట్టుకొనిన వాడనైతినే!

అణు రేణు తృణదల్లి పరిపూర్ణనాగిరువ
గుణవంతనే నిన్న మహిమె గణనె మాడువరారు
ఫణిసి నోడువళిన్ను ఏణాక్షి సిరిదేవి
జ్ఞాన సుగుణతత్వ వేణుగోపాల హరే
కాణెనో నిన్న మహిమె!

నర : స్వామీ! కృష్ణా!

శ్రీని : హరీ! నా తండ్రీ! నాదైవమా! [నేలకూర్చొని అచటి రేణువుల మేననలదుకొనుచున్నాడు. [వరదుడు ప్రవేశించి అశ్చర్యముతో నిలబడినాడు.] రంగా! ఏ పాదరేణువులకై బ్రహ్మాదిదేవతలు నిరంతరము శిరములువంచి, కరములు జోడించి పడిగాపులు కాయుచుందురో, యే పాదరేణువులకై అక్రూరాది మహాభక్తవరేణ్యులు సంతతము తపించిరో, ఏ పాదరేణువులు కఠినశిలకు కమనీయమగు రూపుకలిగించినవో ఆ పవిత్ర శ్రీపాదరేణువు లీకుటీరములో[3]....కృష్ణా! ధన్యుడను ధన్యుడను! సరస్వతీ! ఇవియే! ఇవియే నాతండ్రి శ్రీపాద రేఖలు.

ఇక్కెనోడె రంగనాథన చిక్కపాదవ
సిక్కితె శ్రీలక్ష్మీపతియ దివ్యపాదవ

శంఖచక్రగదాపద్మ అంకిత పాదవ
అంకుశ కులిధ్వజరేఖా అంకిత పాదవ
పంకజాననవ హృదయదలి వలియువ పాదవ
పంకటహరణ వేంకటేశన దివ్యపాదవ ॥1॥

అలనె లక్ష్మి అంకదల్లి నలియువ పాదవ
జలజాసనన అభీష్టవెల్ల సలిసువ పాదవ
మల్లర గెలిదు కంసాసురన కొంద పాదవ
బలియమెట్టి భాగీరథియ పడెదపాదవ ॥ 2 ॥

బండెయ బాలెయ మాడిద ఉద్దండ పాదవ
బండిలిద్ద శకటాసురన ఒద్ద పాదవ
అండజ హనుమర భుజదొళొప్పువ పాదవ
కండెనే శ్రీరంగవిఠలన దివ్యపాదవ ॥ 3 ॥

సరస్వతీ! ఆశాపాశాదులకు అంతుచిక్కని ఆ ఆదిలక్ష్మీవల్లభు నకు ముక్కర దానమిచ్చిన నీవు ధన్యాత్మురాలవు. సకల లోకేశుడు, సర్వసంపత్ప్రదాతయైన ఆ శ్రీహరి అభయ హస్తము క్రింద నీచేయి పైనయైనది. అహో! సరస్వతీ! నీ భాగ్యమే భాగ్యము. నీవంటి సతిని పొందిన నేను పుణ్యశాలి నైతిని!

సర; స్వామీ! అటు లనకుడు. మీవలననే నా జన్మము ధన్యమై నది. ఆ హరి మీకొఱకే వేంచేసినాడు. స్వామీ! ఈ దినమే సుదినము. నిక్కముగ ఈ యిల్లు నేడు శోభిల్లుచున్నది.

శ్రీని: అవును సరస్వతీ! నా కనులు తెఱచుకొనినవి. ధనమదముతో క్రొవ్వి బలిసిన నా గర్వమంతరించినది. సరస్వతీ! నశ్వర ములై, స్వామిని దూరము చేయునవియైన యీ తుచ్ఛసంప దలకు స్వస్తి! (ఆభరణములు తొలగించుచు) కృష్ణార్పణమస్తు! సర్వస్వమూ నీ పాదారవిందములకు సమర్పితము. నిజమగు సంపత్తు నొసగి నన్ను సంస్కరింపుము.

[వరదుడు ఆనందముతో తండ్రి కెదురువచ్చినాడు.]

వరదా! .... .... ....

వర : తండ్రీ! అమ్మ మమ్ములను వితలభక్తి యను సద్గుణాలతో పెంచినది. మీ సేవాభాగ్యమే మాకు కావలసినది. అశాశ్వతములగు ఈ సంపదల ననుభవింపుడని మాత్రము మమ్ముల నాజ్ఞాపింపకుడు. మీ బాటయే మా బాట!

శ్రీని : వరదా!

వర : అమ్మా! నేను తమ్ముల తోడ్కొని వచ్చెదను.

[నిష్క్రమించినాడు.]

శ్రీని : సరస్వతీ! నీ మాతృస్థానము సార్థకమైనది.

సర : అంతయు తమ ఆశీర్వాదమే స్వామీ!

శ్రీని : సరస్వతీ! ఇక యాయవారమే మన వ్యాపారము. దాన పథమే మనకు గర్వకారకము! శ్రీహరి పాదారవింద సంకీర్తనామృతగానమే మన నిత్యనైమిత్తిక కర్మ. తంబురమీటుచు హరినామ సౌరభము సర్వత్రా వ్యాపింపజేయుచు సాధుసజ్జన సంగముతో సాగిపోవుదము.

సర : సంతోషము స్వామీ! ఆ! మరచితిని స్వామీ! మీరు తంబుర యన్నంత జ్ఞప్తికి వచ్చినది. విప్రవేషధారియగు హరి ముక్కెర గొనిపోవుటకు మునుపు ఒక తంబుర, చిరుతలు, అక్షయపాత్ర నా కందజేయుచు, 'అమ్మా! ఇవి నా కత్యంతప్రీతిపాత్రములు. కడుంగడు జాగ్రత్తగాదాచ'మని, 'అవసరమైన నిరాటంకముగ వాడుకొనవచ్చు'నని ఆజ్ఞాపించినాడు!

శ్రీని : సరస్వతీ! నిజమా! నా స్వామి నా కొఱకు వలసినవానిని సైతము ఇచ్చెనా! నిజమగు సంపత్తు నొసగియే వెడలెనా? ఏవి? పావనమగు ఆ ప్రసాదముల చూపుము. త్వరితముగ తెమ్ము!

నర: అజ్ఞ స్వామీ!

[లోని కేగినది.]

శ్రీని: హరీ! ఎంతటి దయ నీది! నిజస్వరూప జ్ఞానమును కలిగించితివా! జ్ఞానాజ్ఞానములు నీ యధీనములే కదా! నీ యాజ్ఞావర్తనగు నీ దాసానుదాసుడను. ఈ దేహము నీ యధీనము. ఆత్మోద్ధారకులగు ఆచార్యులను అనుగ్రహింపుము తండ్రీ!

[తెరలో .... భక్తా! విజయనగరమే నీ నివాసయోగ్యమగు గమ్యస్థానము. వ్యాసరాయులే నీ యాత్మోద్ధారకులగు ఆచార్యులు. ఇకపై 'భక్తపురందరదాసు' అనెడి పేర వాసికెక్కి ప్రసిద్ధుడవగుదువు. శుభమస్తు!]

పురం: ధన్యుడను ప్రభో ధన్యుడను!

[సరస్వతి తంబుర, చిరుతలు, అక్షయపాత్ర తెచ్చినది].

అహా! అహా! (వాటిని తీసుకొని) మహాప్రసాదము! సరస్వతీ. భగవదాజ్ఞానుసారముగ ఇక యతివరేణ్యులు సాక్షాత్, ప్రహ్లాదావతారులగు వ్యాసరాజస్వామివారే మన ఆచార్యులు. విజయనగరమే మన గమ్యస్థానము. నలుగురు బిడ్డలనూ గురుదేవుల కప్పగించి వారి పాదసేవలో కాలక్షేపము చేయుదము. ప్రయాణమునకు సిద్ధము గమ్ము.

సర: అజ్ఞ!

—: తెర :—

ఇది ద్వితీయాంకము.

# తృతీయాంకము

## —: విష్కంభము :—

[తెర లేచినది. విజయనగరమందలి ఒకవీధి. రామాచార్యు డను వృద్ధుడు తులసిబుట్టతో ప్రవేశించి]

ఉగాభోగము

జగవ సుత్తిహుదెల్ల నిన్న మాయవయ్యా
నిన్న సుత్తిహుదెన్న మనవయ్యా
జగకె బల్లిదనీను నినగె బల్లిద నాను
మూరు జగవు నిన్నొళగె నీను ఎన్నొళగె
కరియు కన్నడియల్లి అడగిప్ప తెరవంతె
ఎన్నొళు అడగిదెయో పురందరవిఠలా

రామా: అహా! పదము పదమున మధురత జాలువారుచున్నది. ప్రతి పదమును పరమపదమునకు సోపానమువోలె భాసిల్లుచున్నది. అహా!

[మఱియొక వైపునుండి కృష్ణాచార్యులను వృద్ధుడు ప్రవేశించి]

కృష్ణా: రామాచార్యస్వాములకు నమస్కారములు. తమలో తామే యేదో మురిసిపోవుచున్నారే!

రామా: ఎవరూ? కృష్ణాచార్యులా! నమస్కారములు, నమస్కారములు. మీరు నిన్న మఠమున కనబడకపోయితిరేమి?

కృష్ణా: చిన్నపని యుండి పక్కగ్రామమునకు, వెళ్ళి ఇంతకుక్రితమే తిరిగి యూరు చేరితిని.

రామా : అయ్యయ్యో ! నిన్నటిదినము మీవంటి వారలుండి చూచి, విని, ఆనందమనుభవింప వలసియుండిన పవిత్రదినము.

కృష్ణా : ఏమి విశేషము ? మఠమున వ్యాసరాయ యతీంద్రులు దీన జనోద్ధరణకై మఱియొక మహాగ్రంథము నేదేని నావిష్కరించి నారా ?

రామా : అహహ ! కాదు ! పురందరదాసులవారు రచించిన కృతుల కన్నింటికిని 'పురందరోపనిషత్తు' అని బిరుదము నొసంగి వానిని వ్యాసపీఠమున నిడి గౌరవించిరి. దాసులవారు పర వశమున పాడుట, గురుదేవులు స్వయముగా ఆకృతులలోని అంతర్గత, అత్యద్భుత విషయములను ఉపనిషద్వాక్యములచే సమర్థించి ఉపన్యసించుట జరిగినది. అప్పుడు కల్గిన ఆ యానందమే ఆనందము. కాలమే తెలియరాలేదు. గురువు లనిన వ్యాసప్రభువులే ! శిష్యు లనిన పురందరవర్యులే ! ఇట్టి గురుశిష్యుల అనుబంధముల నెన్నడూ కనివిని యుండలేదు !

కృష్ణా : అఁ ! మీ రెంతటి పుణ్యాత్ములు ! నా కా భాగ్యము లేక పోయినది కదా ! వ్యాసరాయ గురువులవంటి మహాత్ముల కరుణకు పాత్రులైన పురందరదాసులే ధన్యులు. ఈ కన్నుల తోనే కనియుంటిమి కదా, శ్రీనివాసనాయకుడుగా నున్నప్పటి దాసులవారి అట్టహాసము, సంపదాపేక్ష ! ఇప్పుడు సర్వము స్వామిపరము లైనవి. ఎక్కడి పురందరగడము, ఎక్కడ విజయనగరము? సర్వము త్యజించి, కాలినడకతో, భార్యతో, నలుగురు పసిపిల్లలతో గురుపాదపద్మద్వయ సన్నిధియందు మోకరిల్లిరి కదా ! అది అనుకొనిన చాలును, మేను పులక రించుచున్నది.

రామా : మీ రనునది యథార్థము. ఆ మధురక్షణము లెన్నటికిని మరువలేము.

కృష్ణా: ఒక్కకాసునకై కాట్లకుక్కలవలె పోట్లాడుకొనుట కనుచున్నాము కదా! అట్టిది కోట్లకొలది సంపత్తును కేవలము తృణప్రాయముగ నెంచి 'కృష్ణార్పణ'మని యనినారే! ఎంతటి వైరాగ్యమండీ! ఆఁ!

రామా: కారణజన్ములండీ! అట్టి మహనీయుల సాంగత్యము, సందర్శనము, వారి భగవద్విషయోపన్యాసశ్రవణము ఈ జన్మకు లభించినవి. చాలును!

కృష్ణా: సత్యము సత్యము! ఆఁ! మఠమునకేనా? నేను స్నానాదులు ముగించుకొని వచ్చెదను. వ్యాసరాయస్వాముల వారిని, దాసులవారినీ, ఒక్కదినము దర్శనము గావించుకొనకున్ననే యెన్నియో దినములైనటు లున్నది.

[తెరలో....దాసునిగాన న్ను స్వామి చేసుకో వెంకటరమణ]

రామా: అదిగో దాసులవారిని తలంచితిమి. అంతలోనే వారిగానము వినవచ్చుచున్నది. యాయవారమునకు బయలువెడలి నటు లున్నారు.

కృష్ణా: వైరాగ్యమూర్తులగు దాసులవారు కేవలము అజ్ఞానులను ఉద్ధరించుటకే యీ యాయవార మను నెపమున బయలుదేరెదరు. ఆఁ! మఱి సెలవా!

రామా: ఆఁ! ఆఁ! మఱల మఠమున కలిసెదము.

[పరస్పరము నమస్కరించుకొని నిష్క్రమించినారు.]

ఇది విష్కంభము.

[తెర తొలగినది. దాసులవారు యాయవార వేషధారియై, పాడుతూ ప్రవేశించి]

- పాట -

ధానవన్న మాడికో ఎన్న స్వామి
సాసిరనామద వెంకటరమణా ॥ ప ॥

దురుళబుద్ధిగళనెల్ల బిడిసో నిన్న
కరుణకవచవెన్న హరణక్కె తొడిసో
చరణసేవె యెనగె కొడిసో అభయ
కరపుష్పవన్నెన్న శిరదల్లి ముడిసో ॥ 1 ॥

దృఢభక్తి నిన్నల్లి బేడి నా
నడిగెరగువెనయ్య అనుదిన పాడి
కడెగణ్ణలిం నోడి బిడువె
కొడు నిన్న ధ్యానవ మన శుచిమాడి ॥ 2 ॥

మొరెహొక్కవరకావబిరుదు ఎన్న
మరెయది రక్షణెమాడయ్య బిడెదు
దురితగళెల్లవ తరిదు-సిరి
పురందరవిఠల ఎన్ననన్ను బిడెదు ॥ 3 ॥

[ఇంతలో డప్పులు కొమ్ములు మోగించుచు ఒక గుంపు పాడుచూ, ఆడుచూ గొడవగా రంగస్థలంమీదికి వచ్చినది. అందరూ వేపాకులు కట్టుకొని, పట్టుకొనియున్నారు. ఒకరిచేత కోడి, ఒకరి చేత మేక ఉన్నవి. దాసులవారు ఒకమూలగా నిలచినారు.]

మాయమ్మ మాంకాలమ్మో
మాయమ్మ ముత్తాలమ్మా!
మాయమ్మ మారెమ్మ - మాయమ్మ ఊరమ్మ
మాయమ్మ గంగమ్మా

నీకాడి కొత్తాము మాంకాలమ్మో
నీబలివ పేత్తాము మాంకాలమ్మ
నిన్నే పూజిత్తాము ముత్తాలమ్మా
నీకు బలులుపేత్తాము ముత్తాలమ్మా

మాపిల్లగాల్ల రచ్చించు ఓ మారెమ్మా
మావంటలన్ని పండించు ఓ ఊరమ్మా
మాకుమేలు సేత్తే ఓ గంగమ్మా
మేకలు కోత్తామే మాంకాల్మ

హుయ్యారే హుయ్యారే హాయ్ హాయ్!
మేకలు కోత్తామే మాంకాలమ్మా
కోల్లుకోత్తామే మాంకాలమ్మా
దున్నపోతుల కోత్తామే మాంకాలమ్మా
గొర్లు కోత్తామే మాంకాలమ్మా ఏయ్! ఏయ్!

నర : [దాసులవారిని చూచి, అందరినీ అపుచూ, భయభక్తులతో]
రేయ్! అపం[డా! ఆపండెసే! దాసులోరు! దాసులో[రా!
దండాలుసామీ దండాలు!

గుంపు : దండాలుసామీ దండాలు!

పురం : సన్మంగళమస్తు! నరసన్నా! హనుమయ్యా! రామయ్యా!
మీరా! నేనెవరో యనుకొనుచుంటిని! ఏమీ బంధుమిత్రా
దులందరితో బయలుదేరినారు! ఏదైనను పండుగచేసుకొను
చున్నారా!

నర : అవుసామి! జాతర చేసుకుంటావుండాం.

పుర : జాతరా! ఏ జాతర ?

హను : ఇంకే జాతరసామి! గ్యామదేవతజాతర!

పురం : ఓహో! [గామదేవత జాతరయా!
(నరసన్న చేతిలోనున్న కోడితలనిమారుచూ అన్నాడు.)

హను : (బెరుకుగా) సా... మీ .. సామీ....

పురం : ఏమినరసన్నా!(హనుమయ్య దగ్గరనున్న మేకనుతాకుచూ)

నర : మీరు గొప్పోరు. మీరొచ్చే.... యియన్నీ ... అంటు కుంటున్నారేంది సామి....

పురం : తప్పేమున్నది నరసన్నా! (తెరలోనికిచూపుచూ) అదినరే! అదున్నపోతు, ఈ కోళ్లు, మేకలు ఈ మూగ జీవాలను తీసు కొని పోవుచున్నారేమి!

నర : సామీ ....సామీ.... అయన్నీ మీ కెట్టా సెప్పేదిస్వామి!

పురం : ఫర్వాలేదు చెప్పు నరసన్నా!

నర : దేవత... కు....

పురం : అ! దేవతకు....

నర : దేవ....తకు.... హనుమన్నా! నువ్వు జెప్పరా!

హను : దేవతకు ...

రామ : బలిసేసే దానికిసామీ!

పురం : ఓహ్హో! దేనికోసం వీనిని బలిచేస్తున్నారు?

నర : బలిసేత్తే అతల్లి అందర్నీ సల్లగారచ్చిత్తది సామీ!

పురం : నరసన్నా! నాదొక్కమాట వింటారా!

నర : చెప్పండిసామీ, యినుకుంటాము.

హను : మాగ్యామానికి పెద్దోరు. మీరు పెప్పినాకయినుకోవాల సెప్పండి, సామి!

రామ : మీ దయతోనే గదాసామి! మేమూ మడునులమని అని పించుకుంటా వుండాము. మీమాట కాదంటామా!

పురం : చూడండీ! మీరు బలిచేయవలసినదే! కానీ దూరముగా నున్న గ్రామదేవతకు అదున్నపోతును, మేకలను, కోళ్లను

బలిచేయుటకు ముందు మీరు మఱొక గ్రామదేవతకు ఎన్నో కోళ్ళను, దున్నపోతులను, మేకలను బలి యివ్వవలసి యున్నది. అదివిడిచి ఎక్కడో ఊరి చివరనుండు గ్రామదేవత కొఱకు ప్రయత్నము చేయుచూ మీచెంతనేయున్న నిజమైన గ్రామదేవతను మఱచిపోవు చున్నారు!

నర : అదేందిసామీ! ఇదేగదా మాగ్యామదేవత!

హను : ఇంకో గ్యామదేవతంటున్నారు. అదేడుండాదిసామీ?

పురం : ఉన్నది నాయనా! ఆ గ్రామదేవత మనలోనే ఉన్నది.

హను : దానులోరూ! మీరుచెప్పేదేందో మాకు అరతంగాటం లేదు సామీ!

నర : మాకరతమయ్యే యిదంగా సెప్పుసామి! తప్పులుంటే దిద్దు కొంటాము.

పురం : అలాగా!

– పాట –

ఊరదేవర మాడబేకణ్ణ తాన్నాళగె తానే – ఊరదేవర మాడబేకణ్ణ
ఊరదేవర మాడిరెందు సారుతిదె శ్రుతి ఇరకు హగలు
ద్వారగళొంభత్తు ముచ్చి నిల్లిసి భ్రూమధ్యదల్లి

మన శరీరములే పవిత్రములగు గ్రామములు. ఈ గ్రామము లలో రాజభవనములు, కాపలాదారులు, పెద్దపెద్దదారులు, కావలసిన సౌకర్యములు అన్నియును కలవు. వీటన్నిటికీ యజమానిగా నీ ఎద మధ్యలో ఆ 'శ్రీహరి' యుండును. ఆయనే అసలైన గ్రామదేవత! ఆయన మనలను రక్షించుటకు ఇటువంటి బలులేమియునూ కోరడు! ఆదేవుని వదలి ఎక్కడనోయున్న దేవతకై యీ మూగజీవాలను బలి చేయుచున్నారే! ఇది, తీయని గంగానది ఒడ్డున నిలబడి దప్పిక

తీర్చుకొనుటకు బావి త్రవ్వుకొనినటులకాదా? కడవల కొలది పాలిచ్చు కామధేనువును ఇంటిముందుంచుకొని మజ్జిగకై భిక్షమెత్తి నట్లు కాదా! ఆలోచించండి! ఒక్కమారు ఆలోచించండి!

నర : సామీ! నాశరీరమే ఒకగ్రామమా! దీంట్లోదేవుడుండాడా? ఆదేవుని యిడిచేసినామా! ఏందిసామీ ఇది?

పురం : ఇప్పుడే కాదు

- పాట -

యష్టో యుగగళు తీరిహోయ్తు దేవరమాడదె
కష్టదింద నొందె కాణణ్ణ
అష్టదళదా ఖంబ నిల్లిసి కట్టి చక్రంగళను హాకి
సృష్టిదేవర తందు నిల్లిసి దుష్టకోణన శిరవతరిదు ॥ ఊర ॥

ఇప్పుడే యీజన్మకలుగలేదు. ఇటువంటి జన్మలు యెన్నెన్నో గడచినవి. వానికై బాధపడవలసిన అవసరము లేదు. ఆదేవుడు దయతో మనలనుద్ధరించుటకై అన్నింటికంటెను ఉత్తమమైన యీ మానవజన్మము మనకిచ్చినాడు. ఇప్పుడు తెలిసికొనలేనిచో మరిం కెప్పుడునూ తెలుసుకొనలేము. గాలివీచినప్పుడే ధాన్యము తూర్పార పట్టుకొనవలయునుగదా! అదితెలుసుకొని మనలో పెంచుకొనుచున్న దున్నపోతులను వెంటనే ఈ గ్రామదేవతకు బలిగావింపవలెను.

నర : మాలోదున్నపోతుల్ని పెంచుకుంటున్నామా ?

పురం : అవును! 'నాది, నాది' యను స్వార్థములేదూ! అది అన్నిటి కంటెనూ పెద్ద దున్నపోతు. ఆ దున్నపోతును ఈ గ్రామ దేవతయెదుట బలి గావింపవలెను. నీ జన్మసార్థకమై పది మందికి మేలు జరుగగలదు.

నర: అ! ఎంత మంచిమాట సామి! తరించిపోనాను సామి! మీరు సెప్పిన ఆ దున్నపోతును కనుక్కొన నటికి బలిచ్చేత్తాను సామి! మీ పాదాలకాడ పడుంటాను సామి!

పురం: శ్రీహరీ! హనుమయ్యా! ఈ మేక అమాయకపు ప్రాణి. ఇన్నినాళ్ళు పెంచినందులకు నీ కిది తీయనిపాలను ఇచ్చినది. ఈ దినము దీనిని చంపుటకు తీసికొనిపోవుచున్నావు. కానీ, నీ లోపలనే నువ్వు మఱియొక తొమ్మిది మేకలను ప్రేమగా పెంచుకొనుచున్నావు. పాము, పాలుపోసి పెంచినవాడినే కాటువేయ జూచినట్లు నువ్వు ప్రేమగా పెంచినందులకు ఆ తొమ్మిదిమేకలూ నిన్ను నాశనము చేయుటకు కనిపెట్టుకొని యున్నవి. అయిననూ నువ్వు వాటిని ప్రేమించుచున్నావు.

హను: సామీ!

పురం: నువ్వు బలిచేయవలసినది – ఈ మేకనుకాదు, హనుమప్పా! నీకు దారికనపడకుండునటుల గ్రుడ్డివానిని జేయుచున్న ఆ తొమ్మిది భయంకరమగు మేకలను!

హను: అట్టాంటివాటిని నేను పెంచుకుంటున్నానా? సామీ! అయి యేంటియో తెలియజెప్పుసామి! అట్నినఱికిపారేత్తాను

– పాట –

పురం :–

కష్టకర్తా నెంబ కురియట్టా, అదమతందు
కట్టి తలెయను ఒడెయ బేకట్టా
అష్టమదదా కురిగళన్ను కట్టితలెయను చండనాడి
అట్టితిరుగువ కోళియన్ను కుట్టి మాకి హాకుతలి ॥ఊర॥

హనుమయ్యా! నువ్వు విషముష్టిగింజను నాటితివనుకొనుము. ఏచెట్టుమొలుచునో చెప్పుము.

హను : ఇనముట్టి చెట్టుసామి!

పురం : మామిడి చెట్టు మొలువదు కదా!

హను : ఇనముట్టి గింజనాటితే మామిడి సెట్టెట్టా మొలత్తాది సామి!

పురం : అవునుకదా! మరి 'హింస'కు మాత్రము ప్రతిఫలముగ సుఖశాంతు లెట్లు కలుగగలవు? ఒక్కమారు ఆలోచింపుము!

హను : (కొంచెమాలోచించి) ఇనముట్టి...గింజ....ఇనముట్టి.... చెట్టు.... ఇంస....ఇంసే ..! సత్తెంసామీ! మీరు సెప్పింది సత్తెం సామీ!

పురం : కనుక యీ మూగజీవాలను బలిగావించినందువలన ఎన్న టికినీ రక్షణ జరుగబోదు! మనయందు వయోమదము, అధి కారమధము, ధనమధము, మున్నగు ఎనిమిది మదముపట్టిన మేకలున్నవి. వానిని మనము రూపుమాపవలసినది!

హను : (మేకనువదలి) నిజమేతండ్రీ! ఇన్నాల్లూ తప్పుదారిలోనే పోయినాము. ఈ యాల మాకు అసలు మారగం సూపినావు.

పురం : రామన్నా!

రామ : అరతమై పోనాదిసామి! నాకాడ 'కామం' అనే పెద్ద కోడి వుండాదిసామి! నీదయుంటే దాన్ని బలిసేసేత్తాను సామీ! (కోడిని వదిలివేసినాడు)

పురం : మంచిది రామన్నా! ఎంతచక్కగా అర్థము చేసికొనినావు! బ్రహ్మానందము కలుగుచున్నది.

నర : ఎంతప్రేమ తండ్రీ మామీద!

పురం : నరసన్నా! నాప్రేమకన్నాను ఆ శ్రీహరి ప్రేమ అనంత మైనది; అనమానమైనది. ఆప్రేమస్వరూపుని యీ దినము నుండే కొలువనారంభించండి!

రామ : కానీసామీ! మాకు ఆ పూజలు గీజలు యేయీ తెల్వవు గదసామీ!

హను : మొరటోల్లం గదసామీ!

పురం : ఆస్వామిని పూజించుటకు ఏమియునూ తెలియనవసరము లేదు. మంచితనమను నీటితో కడిగి ప్రేమయను గంధము పూసి, అప్యాయత, అనురాగము, ఆదరణ యను పూలను సమర్పించి ఒక్క నమస్కారముతో సత్కరించిన చాలును! నేడే ప్రారంభము గావింపుడు! రేపు మనదికాదు! జీవితము క్షణభంగురము. మరల యీ జన్మలభించునో, లభింపదో!

- పాట -

మందె ఇంథా జన్మ బరదణ్ణ నోడణ్ణ నీను
మందమతియు బేడ కాణణ్ణ
హిందినాకష్టావ మరెదు ముందినా హమ్మన్ను తొరెదు
తందెపురందర విఠలన్న హొందలు నీముక్తనణ్ణ -
ఉరదేవర మాడబేకణ్ణ

సృష్టికర్తయైన శ్రీహరి కరుణించి యిచ్చిన ఈ జన్మను సార్థక మొనర్చుకొనుడు.

హను : సామీ!

పురం : ఏమి హనుమయ్యా!

హను : ఇంతవరకే ఏన్నో పాపాలు సేసేసినాము గంద! అయ్యన్నీ తీరేదెట్టాసామీ!

పురం : చేసిన తప్పులకు పశ్చాత్తాపపడిన చాలును. మనతండ్రి శ్రీహరి తన అక్కున చేర్చుకొని మక్కువతో కాపాడగలడు! ఆయన క్షమాసముద్రుడు. తల్లి - బిడ్డలు చేసిన తప్పులను

లెక్కించునా!! చేసిన తప్పులు ఆ అప్పునికి అప్పచెప్పి ఇకముందు వేయు ప్రతి అడుగు పవిత్రముగా వేసి లోకమునకు అదర్శ ప్రాయులు కండి!

నర : పొలుతం్రడీ! పొలు! దైర్న మొచ్చేసినాది. మారగం కనబడి పోనాది. తమబోటోల్లవల్లనే పెపంచకం ఉద్ధారకమైపోతాది!

పురం : అందరినీ ఉద్ధరించగలవాడు ఆ శ్రీహరియొక్కడే! మహా జనులారా! పవిత్రమైన మనస్సుతో కూర్చొనిననూ, లేచిననూ పండుకొనిననూ, పొలములోనున్ననూ, ఏపనిచేసిననూ ఆ హరిసంకీర్తన విడువకుడు! హరినామప్రాశస్త్య మమోఘమైనది, దానిని మించినది మఱొకటిలేదు.

పాట

కలియుగదలి హరినామవ నెనెదరె
కులకోటిగళుద్ధరిసువవో రంగ ॥ ప ॥

సులభద ముకుతిగె సులభనెందిసువ
జలరుహనాభన నెనె మనవే ॥ అప ॥

స్నానవ నరియెను మౌనవనరియెను
ధ్యానవ నెరియెనెందెనబేడా
జానకివల్లభ దశరథనందన
గానవినోదన నెనె మనవే ॥ 1 ॥

అర్చిసలరియెను మెచ్చిసలరియెను
తుచ్ఛను నానెందెనబేడా
అచ్యుతానంతగోవింద ముకుందన
ఇచ్ఛయింద నీ నెనె మనవే ॥ 2 ॥

జపవొందరియెను తపవొందరియెను
ఉపదేశవిల్లెందెన బేడ
అపారమహిమ శ్రీపురందర విఠలన
ఉపాయదిందలి నెనె మనవే ॥ 3 ॥

ఆ నారాయణుని నామము జపించి జన్మసార్థకము గావించు కొనుడు.

వర : సాలు సామి సాలు. ఇంత నారాయణ మంతరమే తారక మంతరము. మీరే మా గురుదేవులు. వత్తాం సామి వత్తాం. దండాలు సామి.

గుంపు : దండాలు సామీ!

[అందరూ వెళ్ళిపోయినారు.]

పురం : కృష్ణా! జన్మసార్థకమైనది. సుజీవులను ఉద్ధరించు భాగ్యము నొసగినావు. అంతయు నీ కృపాకటాక్షమువలననే సాధ్యము. నీ పాదపద్మములకే సమర్పితము.

[వరదుడు ప్రవేశించినాడు.]

వర : తండ్రీ!

పురం : ఏమి నాయనా వరదా!

వర : ప్రయాణమునకన్నియు సిద్ధములైనవి. అమ్మ మిమ్ములను తోడ్కొని రమ్మనినది.

పురం : ఓ! అవును! మరచితిని. ఈ దినము తిరుపతికి ప్రయాణము గదా! పద! మఠమున కేగి గురువుల ఆశీస్సుల నందుకొని పోవుదము. శ్రీనివాసుని దర్శనమునకై ఎద యువ్విళ్ళూరు చున్నది.

వెంకటాచలనిలయం వైకుంఠపురవాసం
పంకజనేత్రం పరమపవిత్రం
శంఖచక్రధర చిన్మయరూపం ॥ వెం ॥

అంబుజోద్భవవినుతం అగణితగుణనామం
తుంబురునారదగానవినోదం
అంబుధిశయనం అగణితనామం ॥ వెం ॥

సాహి పాండవపాలం కౌరవహరణం
బాహుపరాక్రమ పక్షిపతిశయనం
అహల్యాశాపవిమోచన చరణం ॥ వెం ॥

సకలవేదవిచారం సర్వజీవనికారం
మకరకుండలధర మదనగోపాలం
భక్తపోషణ శ్రీపురందరవిఠలం ॥ వెం ॥

[నిష్క్రమించినారు]

ఇది తృతీయాంకము.

# చతుర్థాంకము

[తిరుమల వేంకటేశ్వరుని మందిరములో యజ్ఞశాల. పురందరదాసులు ఏకాంతసేవ చేసుకొని ప్రవేశించి]

శవశించుము పరమాత్మా స్వామీ
భవరోగవైద్యా భక్తజనప్రియా

(తనలో తాను నవ్వుకొని) నీ సేవానక్తులగు భక్తులకే నిద్రాహారాదు లుండవనుచుండిన ఇంక నీకు నిద్రయా? కల్యాంతమునందు యోగనిద్రాముద్రితుడవై కలుములరాణికి కన్నుల పండువు గూర్చు కైవల్యనాథా! నీ సర్వకార్యకలాపములు భక్తులకు ముక్తిగూర్చుటకే; నీ లీల తెలియుట యసాధ్యము. అల్పుడనగు నాకు తాళ్ళపాకవారిచే గౌరవమర్యాదలు అందింపజేసి, నీ యజ్ఞశాలనే విడిది గావించితివి. నీ ఏకాంతసేవా దర్శనభాగ్యమును ప్రసాదించితివి. వేంకటప్రభో! నీ వాత్సల్యము, వైభవము, వేడుకలు విశ్వమున మరేవిభునకు కలవు?

ఉగాభోగము :

యావద్దైవక్కూ ఈ వైభవనుకాణె తిరువెంగళప్ప శ్రీనివాస
యావద్దైవక్కూ ఈవైభవను కాణె
రావణాంతక స్వామి పురందరవిఠలా

[అన్నమాచార్యులవారు ప్రవేశము. దాదాపు తొంబది సంవత్సరముల వయసుతో నున్నారు.]

అన్న : దాసవరేణ్యా నమోనమః!

పుర: (త్వరగావచ్చి చేయి పట్టుకొని) అన్నమాచార్యస్వాములా! నమో నమః! చెప్పిపంపిన నేనే యరుదెంచెడి వాడను గదా! ఈ రాత్రి యింతశ్రమ ఏలగైకొంటిరి?

అన్న: మీ దర్శనానందము ముందీ శ్రమ యెంతటిది? మీ దర్శనము సాక్షాత్తు నాదబ్రహ్మయగు విఠలదర్శనమువోలె నున్నది.

పురం: కేవలము చిన్నవాడను. దేవరవారు శ్రీనివాసుని పరమానుగ్రహమునకు పాత్రులు. మేనుమరచి పాడి, యాడి స్వామినే యాడించిన పెద్దలు మీరు. దేవరవారి దర్శనభాగ్యము నా పూర్వజన్మసుకృతవిశేషము!

అన్న: విఠలునితో మీ రాడిన వేడుకలు, మీ భక్తివ్యక్తిత్వములు వీనులార వినియుంటిమి. అవి వాస్తవములని తమ దర్శన భాగ్యమున ధ్రువీకరణమైనది. అః! తమకంతయు సౌకర్యముగా నున్నదా?

పుర: వైకుంఠమున సౌకర్యమునకు, సంతోషమునకు ఏమి లోటుండును?

అన్న: భళా! కడుంగడు లెస్సగా పలికితిరి! శ్రవణానందమైనది. ఇకపై స్వామిని యథేచ్ఛగా నెల్లవేళల సేవింపవచ్చును. స్వామి మీవాడు కనుక.

పుర: జ్ఞానవృద్ధులు నన్ను పరీక్షించుచున్నారు! అనంతవాత్సల్య సాగరుడగు శ్రీహరి అందరికీ ఆత్మసఖుడు. ఆ స్వామికి తన వారు పెరవారను భేదములేదు. ద్వేష, ఉదాశీనలకు అత్యంత దూరుడు. భక్తిపాశములచేత మాత్రమే బంధింపబడువాడు! భక్తిపాశమునకు కట్టుబడిన యా ప్రభువు ప్రీతితో భక్తుడిచ్చిన యిన్ని పూలకు సంప్రీతుడై, అతని యింటికి గడ్డిసైతము మోయగలడు!

అన్న : ఓహో!

పురం : హరావ తరువర మనెగె హుల్ల తరువా
అవ్వలకుమీరమణ ఇవగిల్లె గరువా ॥ ప ॥

ఒందుదళ శ్రీతులసి బిందు గంగోధకవ
ఇందిరారమణగర్పిత వెన్నలు
ఒందెమనదలి సింధుశయన ముకుంద ఎనె
ఎందెందువాసివనా మందిరదొళగె ॥ 1 ॥

పరిపరియపుష్పగళ పరమాత్మగర్పిసి
పరిపూర్ణనెందు పూజెయను మాడి
పరమ అవక్తియలి సేవెయను మాడిదరె
పరిభాగ కొడువ తన్నరమనెయొళగె ॥ 2 ॥

పాండవర మనెయొళగె కుదురెగళ తా తొళెదు
పుండరీకాక్షన హుల్లనే తినిసిద
అండజవాహన శ్రీపురందరవిఠలను
తొండరిగె తొండనాగి సంచరిసుతిహను ॥ 3 ॥

[పాటచివర అన్నమాచార్యులు ఆనందముతో దాసులవారిని కౌగలించుకొని]

అన్న : ఈ దినము సుదినము! నా శ్రీనివాసుని కారుణ్యము నెంత చక్కగా చిత్రీకరించినారు! ఇకపై నీ యానందమును ప్రతి దినము కలుగజేయవలెను.

పుర : నా కోరికయును అదియే! ఈ దిన మేకాంతసమయమునందు తమ తిరుముఖమండలమునుండి వెలువడిన స్వామి లీలావైభవ స్తుతులు నా హృదయఫలకమున నిలిచిపోయినవి.

అన్న : సంతోషము! అ! కాలాతీతమైనది. నేను వత్తునా?

పురం : అంతవఱకు తోడుగా .... ....

అన్న: ఎందులకు? మీరు విశ్రమించండి. శ్రీనివాసా! (ఒక్క అడుగు వేసి)

పురం: (నవ్వి) అవును! శ్రీనివాసుడు తోడై, నీడై తిరుగాడుచుండగా మఱియొక తోడేల?

అన్న: మరి వచ్చెదను.

పురం: వెళ్ళిరండు! అభివాదములు.

[అన్నమాచార్యుడు నిష్క్రమించినాడు. తదుపరి దాసులవారు వస్త్రము పరచుకొని నిద్ర కుపక్రమించబోతూ]

—: రాత్రిసూక్తమ్ :—

హరిః ఓం. రాత్రివ్యఖ్యదాయతీ పురుత్రా దేవ్యనిక్షభిః । విశ్వా అధి శ్రియోఽధిత ॥ 1 ॥ ఓర్వ్యప్రా అమర్త్యా నివతో దేవ్యుద్వతః । జ్యోతిషా బాధతే తమః ॥ 2 ॥ నిరుస్వసార మస్కృతోషసం దేవ్యాయతీ । అపేదు హాసతే తమః ॥ 3 ॥ సానో అద్యయస్యా వయం నితే యామన్నవిక్ష్మహి । వృక్షేనవసతిం వయః ॥ 4 ॥ నిగ్రామాసో అవిక్షతనిప ద్వన్తోనిపక్షిణః । నిః శ్యేనాసశ్చిదర్థినః ॥ 5 ॥ యా వయా వృక్యం ని వృకం యవయస్తే న మూర్మ్యే । అథా నః సుతరాభవ ॥ 6 ॥ ఉపమా పేపిశత్తమః కృష్ణం వ్యక్త మస్థిత । ఉష ఋణేవ యా తమ ॥ 7 ॥ ఉపతేగా ఇవాకరం వృణీష్వదుహితర్దివః । రాత్రి స్తోమం న జిగ్యుషే ॥ 8 ॥

— జాగ్రదవస్థకు కారణభూతుడై కనుపాపలలో నిలిచి కార్యములు జేయు విశ్వనామక పరమాత్మా! నీవు చేసి, నాతో చేయించిన సర్వ కర్మలు నీ పాదారవిందములకు సమర్పితములు.

మాతా పితామే గతిరాత్మబంధుః
భ్రాతా సఖామే పరదేవతా చ
రాజా గురుః సర్వమపి త్వమేవ
యత్తే ప్రియం దేహి సుఖ[భ]క్తిమద్య.
శరీరయాత్రా మమ తే ప్రణామః
స్తుతిస్తు వాగింద్రియ వృత్తిరస్తు
సర్వా మనోవృత్తి రనుస్మృతిస్తే
సర్వం త్వదారాధన మేవ భూయాత్.

— శయ్యా, నిద్రాకాలమందు స్మరణీయుడైన సంకర్షణ పద్మనాభ రూప ప్రభో, నీకు నమస్కారము. కంఠగత తైజసరూపా హరీ! ఉత్తమస్వప్నములు కలిగించి ఉద్ధరించుము. హృద్గతప్రాజ్ఞనామక ప్రభూ! సుఖసుషుప్తిని కలిగించుము తండ్రీ!

ఉగాభోగము

హగలు నిన్న నెనెయలిల్ల హసివెతృషియింద
ఇరళు నిన్న నెనెయలిల్ల నిద్రెభరదింద
యరడరబాధెగె నానొళగాదెనో పురందరవిఠలా

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.

పురం: (పడుకొని ప్రయత్నించునంతలో వెక్కిళ్ళు ప్రారంభమైనవి.)
కృష్ణా! ముకుం....దా! హరీ! అచ్యుతా....ఏమిది? సర....
స్వతీ! సరస్వతీ! వరదా!....వరదా!

(లోపల వరదుడు 'ఓ'....)కొద్దిగా మంచినీరు తే నాయనా!
[బంగారుచెంబుతో శ్రీనివాసుడు వరదునిగా ప్రవేశించినాడు.]

వర: తండ్రీ! ఇదిగో నీరు!

పురం: ఆ! (తీసికొని) బుధాంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత సుశీలాసహిత శ్రీకృష్ణార్పణమస్తు! (నీరుత్రాగి, చెంబు చూచి) వరదా! ఏమిది?

వర: నీటిపాత్ర!

పురం: అది సరియే! ఇది యే లోహమో తెలిసినదా?

వర: సువర్ణము. అందు సందేహమేమి?

పురం: సందేహము లేదు. అందులకే నిన్ను అడుగుచున్నది! ఇది యెవరిది?

వర: నాదే!

పురం: నీకెట్లు వచ్చినది?

వర: భక్తుడొకడు సమర్పించినాడు!

పురం: (క్షణమాగి) వరదా! హేమముపై మోహము కలుగుచున్నదా?

వర: లేదే!

పురం: మఱియేల చేయిచాచి యాచించితివి?

వర: నేను అందరినీ యాచింతునా? అతడే యిచ్చెను; నేను పుచ్చుకొంటిని.

పురం: ఇచ్చిన పుచ్చుకొనుటయేనా?

వర: భక్తితో ఇచ్చినదానిని పుచ్చుకొనుటయం దపచారమేమి?

పురం: అయిన పుచ్చుకొనుట పరిత్యజించవన్నమాట?

వర : పరిత్యజించిన ఆ భక్తులెట్లుద్ధరించ బడుదురు!

పురం : ఓహో! నీవు దేవుడవైపోయితివా? భక్తులనుద్ధరించు శక్తి నీకు వచ్చినదా? చేసినది పొరపాటని తెలిసియూ మరల దానినే ధైర్యముతో సమర్థించుకొనుచున్నావా?

వర : తండ్రీ! అది పొరపాటు కాదని నా యభిప్రాయము!

పురం : (స్వగతము) నా వరదుడేనా యిటుల మాటలాడుచున్నది (ప్రకాశముగా) వరదా! నీమతి చలించలేదుకదా! వరదా! నీనిపైవ్యామోహము వినాశకారకము. "యత్రాస్తిభోగో నచ తత్రమోక్షః" ఇది నాస్వానుభవము. స్వామిని దూరముచేయు ఐశ్వార్యాదులనై మోహము పెంచుకొనక వెన్వెంటనే త్రుంచి వేయుము.

వర : అదేమి తండ్రీ! ఈ బంగారము నన్ను మోహింపజేయునా? అసాధ్యము! ఈదినము దీనినిగైకొనక పోయితినేని అభక్తుడు భంగపడిపోగలడు. కాన దీనిని గొనుటయే యుక్తమని....

పురం : వరదా! ఈ పదార్థము నీమతిని నాశనము జేసినది. ఛీ! భ్రష్టుడా!

[చెంబుతో తలపై మోదినాడు.]

వర : తండ్రీ! నేననినదానిలో తప్పేమున్నది? నిజమునే పలికితిని.

పురం : ఛీ! మాటకు మాట బదులిడుచుంటివా! నా ఎదుట నుండి వైదొలగుము.

వర : అట్లే తండ్రీ! ప్రక్కనే యుందును. మరల పిలిచినపుడు రాగలను [చెంబుతో వెడలినాడు.]

పురం : దేవా! ఏమిది? ఎన్నడునూలేని - మనోవ్యథ యీనాడు ఇచ్చటు కలిగించితివే! నీవు కరుణించి ప్రసాదించిన వరదుడు వ్యామోహామునమునిగి పోవుచున్నాడు. ఈ అల్పుని ఉద్ధరించి నట్లు అచిరంజీవిని యుద్ధరించుము. నీ దివ్యసన్నిధానమున కామక్రోధలోభ మోహాదులకు స్థానమా! శాంతిస్థైర్యముల ప్రసాదింపుము తండ్రీ!

(సరస్వతి, వరదుడు ప్రవేశించినారు.)

సర : స్వామీ! హరికథాశ్రవణము చేయుచున్న మాకు కాలమే తెలియరాలేదు అలస్యమైనది. మీకేమైన అవసరమైనదా?

పురం : (వరదుని తలనిమురుచూ) వరదా! దెబ్బగట్టిగా తగిలినదా! నొప్పిగానున్నదా?

వర : అదేమితండ్రీ అటులడుగుచున్నారు దెబ్బయేమి? నొప్పిగా నుండుటయేమి?

పురం : అప్పుడే మఱచితివా? చూడు నాయనా! సంపత్తు స్వామి యందలి భక్తిప్రపత్తులను అడుగంటింపజేయగల మహావిపత్తు. ఆ బంగారపు చెంబును శ్రీనివాసుని 'హుండీ' యందు శీఘ్రముగ సమర్పింపుము!

వర : ఏమిది తండ్రీ! మీరనునది నా కగమ్యగోచరముగనున్నది. బంగారపుచెంబు నాకడ ఎక్కడది?

పురం : వరదా!!! సరస్వతీ! చూచితివా వీని వ్యవహారము. ఇంతకు క్రితమే నేను "వరదా! కొంచెము మంచినీరు తే నాయనా" అనియడుగ స్వర్ణపాత్రముతో నీరుతెచ్చి, అది తనదేనని, ఒకభక్తుడిచ్చెనని, పుచ్చుకొనిన తప్పేమని, నాతోవాదులాడి

నాడు. నేను కోపము పట్టలేక వానితలపై కొట్టితిని కూ— ఇప్పుడు....

[సరస్వతికి అంతయూ అగమ్యగోచరముగ నున్నది]

వర : అయ్యో! లేనేలేదు తండ్రీ! అమ్మతోపాటే హరికథకు వెళ్లినవాడను అమ్మప్రక్కనేయుండి, మరల అమ్మతోనే వచ్చితిని. అమ్మా! చెప్పవే నీవైనా!

సర : అవును స్వామి! నాకునూ అగమ్యగోచరముగ నున్నది. వరదుడు నాయొద్దనుండి కదలి వెళ్లనేలేదు.

పురం : ఏమి? వరదుడు రానేలేదా! మరి యింతకు క్రితము వచ్చినది?

సర : అదేస్వామీ! విచిత్రముగ నున్నది. మీరావరదుడే వచ్చెనను చుంటిరి, వరదుడా, ననువదలి రానేలేదు. మరి.... స్వామీ! సంశయమే లేదు. మనపాలిట వరదుడగు శ్రీనివాసుడే మీరు "వరదా" యని పిలువ వరదుడై స్వర్ణపాత్రమున నీరు తెచ్చినాడేమో!

[పురందరదాసులవారు ఆలోచించుచున్నట్లు నిలిచినారు. నేపథ్యమున వరదుడు]

"భక్తుడొకడు సమర్పించినాడు."

"నేను అందరినీ యాచింతునా!"

"భక్తితో ఇచ్చినదానిని పుచ్చుకొనుటయందు అపచారమేమి?"

"పుచ్చుకొనుట పరిత్యజించిన భక్తులెట్లుద్ధరింప బడుదురు?"

పురం : అవును....అవును సరస్వతీ! నీవనినది సత్యము. సందేహము లేదు. స్వర్ణపాత్రముతో వరదునిరూపమున వేంచేసి నాయెదుట

నటించినవాడు మనపాలిటవరదుడే! వరదా! శ్రీనివాసా! సమద్దేవతామౌళి మందారమాలా ప్రసవన్మాకరంద ద్రవాక్షాలిత పాదపంకేరుహా! కవి భిరీడిత కైరవదళశ్యామ నిస్సీమాలి పరంధామా! ఏమినీలీల? శ్రుతితతులనభిమానించు ఆశ్రీన, స్తుతులకే గోచరింపని అప్రతిహత మహైశ్వర్యా! సకల సద్గుణ గణాంభోధీ! బ్రహ్మసమీరవాణి ఫణీంద్ర వీంద్ర భవేంద్రాద్య మరవరులే సమ్మోహితులై, నీమాయ కనుగొనజాలరనిన నేమియుతెలియని పామరుడను, నరుడను, మహాపాపిని నే నెంతవాడను?

- ఉగాభోగము -

తప్పు సాసిరగళ వప్పికాయో కృపాళు
ముప్పురవ నళిదంథ మునీంద్రవంద్యా
అప్రమేయనె నిన్న అమృతమహి మెగళ
అప్పునిధియల్లి పుట్టదవళరియళో
కప్పుమేఘయిందొప్పువ తిమ్మప్పా
అప్రాకృతరూపా పురందవితలా.

శ్రీనివాసా! పుత్రరూపమున విచ్చేసిన నిరణద్భృంగ సంసక్త సంపుల్ల మందారమాలావళీ లగ్నసత్కంఠ శోభాభిరామము, రాకేందు కోటిప్రభావిభాసితము, సకల సంతాపహారకమునగు నీ దివ్యముఖ మండలముపై.... అయ్యో! నేనెంతటిపాపిని! నేనెంతటిపాపిని!! ఇంక నాకిజన్మమెందులకు?

సర : స్వామీ! అట్లనవలదు!

వర అవును తండ్రీ! మీరు పూతాత్ములు! సాక్షాత్తుస్వామియే మీకు సాక్షాత్కరించినాడు. ఆ సర్వేశ్వరుని సర్వకార్యకలాప ములు సద్భక్తజనోద్ధరణమునకే! సంతాపమందవలసినపనియే లేదు.

పురం : దయానిధే! భృగు సురేంద్రాదులొనర్చిన మహాపరాధ ములను గణియించని కరుణాసముద్రుడవునీవు! పాపకర్మము లను సహించుటయందు నీకు సములైన దేవతలను ఈ అఖి లాండములయందెందును గాన! తెలియకచేసిన నా యీ అపరాధమును మన్నించవా! కాపాడవా, కదలిరావా!

\- పాట -

బారయ్య వెంకటరమణ భక్తజననిధియే
తోరయ్య నిన్నదయ తోయజాంబకనే ॥ ప ॥

వేదగోచర బారో - ఆదికచ్ఛప బారో
మోదసూకర బారో - సదయనరసింహ బారో ॥ 1 ॥

వామనభార్గవ బారో - రామకృష్ణనె బారో
ప్రేమద బుద్ధనె బారో - స్వామికల్కి ని బారో ॥ 2 ॥

అరవిందనాభ బారో - సురరప్రభువె బారో
పురుహూతవంద్య బారో - పురందరవిఠల బారో ॥ 3 ॥

ప్రభో, దర్శనమీయవా! దయగనవా, కావగరావా! హుం, అవును, నీవేలవత్తువు, నేనొనర్చిన ఘోరాపరాధము క్షమింప రానిదే, వేంకటేశప్రభో, జగజ్జన్మసంరక్షణజ్ఞానసంహారబంధాదులకు కారణభూతుడవు, ముక్తవాగీశ, పక్షీశ, భోగేశ, దేవేశ, కందర్పా ద్యఖిలామరగణ ముఖ్యసేవితుడవు, నిత్యనిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌన్దర్య సౌగన్ధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంతకల్యాణగుణ నిధిస్వరూపుడవగు నిన్ను గాయపరచిన తుచ్ఛములగు నా ఈ చేతు లను ముక్కలు ముక్కలు గావించెదను, శిరమును ఛిన్నాభిన్న మొనర్చుకొనియెదను, ప్రాణత్యాగ మొనరించెదను,

[నేలబడి తల, చేతులు బాదుకొనుచున్నాడు.]

సర : స్వామీ! స్వామీ!

వర : తండ్రీ! తండ్రీ!

పురం : సరస్వతీ! (వెఱ్ఱిగా) సకల జగద్రక్షకుని గాయపరచిన చేతులు సరస్వతీ యివి! (బాదుకొని) ఆఁ! ఇదియే తగినశిక్ష! ప్రాణత్యాగమే సరియగుశిక్ష!

సర : స్వామీ! శ్రీనివాసా!

వర : జగన్నాథా వేంకటేశా!

[గంటలుమ్రోగుచుండగా శ్రీనివాసుడు కదలివచ్చినాడు.]

శ్రీని : భక్తపురందరా! నీ శ్రీనివాసుడను! నీకై యేతెంచితిని.

[అందరూ నమస్కరించినారు.]

పురం : దేవా! ప్రభో! దేవదేవా!

అచ్యుతానంతగోవింద వామనవాసుదేవ నారాయణా!
సచ్చిదానందస్వరూప గోపాలపురుషోత్తమ పరంధామ
నారాయణా!
మత్స్యకూర్మ వరాహ నారసింహవామన భార్గవ రాఘవ
కృష్ణ కల్క్యవతారా - అనంతావతారా నారాయణా!
అపారమహిమనె నారాయణా!
సర్పశయననే నారాయణా!
శ్రీపురందర విఠల విబుధేశా తిరువేంగళప్ప!
ఎన్నప్ప నారాయణా అచ్యుతానంత గోవింద!

---

గమనిక :- శ్రీనివాసుని పాత్రప్రవేశాన్ని విసర్జించాలనుకున్నవారు, తెరవెనుక నుండి ఈ అంకం ఆఖరవుతున్న 'దాసా, నేను కాలాంతర్గత........ అన్న మాటల్ని చెప్పించి. ఆ తరువాతవున్న 'ధన్యోస్మిప్రభో!........., అన్న మాటల్ని పురందరదాసుపాత్రచేత చెప్పించి, 'ఇక నీయాత్ర పురందరపురము నకు సాగనిమ్ము' అని తెరవెనుకనుండి చెప్పించి, ముగించాలి. "భక్తా! పురందరా! నీ శ్రీనివాసుడను! నీకై ఏతెంచితిని".... అన్నమాటనుండి, "మనశ్శాంతి కలిగింపుము." అన్న పురందరదాసు మాటలవరకూ, సుళాదినీ వదిలివేయవలెను.

శ్రీని : భక్తా! పురందరా! ఆనందమైనదా ?

పురం : ఇంతకన్న మహానందమింకేమున్నది ముకుందా! ఆనంద సాగరమున ఓలలాడించితివి! కానీ.... ఓ జగన్నాటక సూత్ర ధారీ!

శ్రీని : ఏమది? నిస్సంకోచముగ చెప్పవచ్చును!

పురం : దేవాదిదేవా! బాధ్యాధిగతుడవు, బాధకస్థితుడవు, బాధ్యు డవు, బాధకుడవు నీవేయని తెలుసుకొను జ్ఞానము నొసగి నావు. కానీ నిన్ను కొట్టితినన్నవ్యథ నన్ను మిక్కిలి పీడించు చున్నది. ఈ ఘోరాపరాధమునకు శిక్షవిధించి ప్రక్షాళనము గావించి మనశ్శాంతి కలిగింపుము!

శ్రీని : దాసా! నేను కాలాంతర్గత కాలప్రవర్తక, కాలనివర్తక, కాలోత్పాదక కాలమూర్తినైననూ, కాలాతిక్రమణము చేయు వాడనుగాను. కాలమే కలుగవలసినవి, కావలసినవి కల్పించు చుండును. ఏది ఏమైననూ నా భక్తులను వీడను. నే నెప్పటికీ మీవాడనే! మీతో ఆడుట నా వేడుక!

పురం : ధన్యోస్మి ప్రభో! ధన్యోస్మి!

శ్రీని : ఇక నీయాత్ర పండరీపురమునకు సాగనిమ్ము!

పురం : ఆజ్ఞ! మహాప్రసాదము!

[అందరూ నమస్కరించుచుండగా తెర.]

ఇది చతుర్థాంకము.

# పంచమాంకము

## విష్కంభము

[తెర లేచినది. పండరీపురములోని ఒకవీధి. ఇద్దరు వ్యక్తులు తీవ్రముగా వాదించుకొనుచూ ప్రవేశింతురు.]

అధికప్రసంగి: ఇంతకూ నువ్వనునదేమి? నువ్వు పట్టిన కుందేటికి మూడేకాళ్ళని .... .... అంతియేనా?

అర్చకుడు: కాదు. అనుచున్నది నీవు. నే ననుచుంటినని యనుచున్నావు.

అ.ప్ర: ఏమిటయ్యా నే ననుచున్నది?

అర్చ: ఏమా? ఆ గ్రుడ్డి ప్రభుత్వము, గ్రుడ్డి వ్యవహారము చేయుట. దాని విని నీబోటివారలు సమర్థించుట. అనుటకైనను అర్థముండవలెనయ్యా!

అ.ప్ర: ఆఁ! చేయు చెడ్డపనులు చేయవచ్చును గాని దండించిన ప్రభుత్వము మాత్రము గ్రుడ్డిదియా?

అర్చ: ఏమిటయ్యా చేసిన చెడ్డపని?

అ.ప్ర: అయిన, అది చెడ్డపని కాదందువన్న మాట?

అర్చ: ఏది?

అ.ప్ర: ఏదయ్యా?

అర్చ: ఏదయ్యా?

అ.ప్ర: మఱల యేదనుచున్నావే?

అర్చ: ఏదియో చెప్పరాదా?

అ.ప్ర: ఏమిటి చెప్పునది? నీబోటి తెలివితక్కువ సన్యాసులున్నారు కనుకనే సోమరులు, జూదరులు, వ్యభిచారులు దాసులమని పేర్లు పెట్టుకొని ప్రజలను మోసముచేసి మనుట!

అర్చ: పూర్వాపరము లాలోచింపక మహనీయు లననవపరముగా నిందించిన రౌరవాది నరకములు తప్పవు!

అ.ప్ర: ఆ! మహనీయులే! చెప్పునవి శ్రీరంగనీతులు, దూరునవి దొమ్మరిగుడిసెలు! ఇంకనూ నయమే! నేను సైతము ఆ యంగనా దాసుడగు దొంగదాసుని పూర్తిగా నమ్మితిని కాను. నమ్మిన నేనును నీ వలెనే అర్థమూ-పర్థమూ లేని వాదనలు చేసెడివాడనే!

అర్చ: ఛీ! ఆ పరమభక్తాగ్రేసరుని నమ్మియుండిన వారెంతటి భాగవతోత్తములో, ఆదర్శజీవులో, వేదాంతులో నీకు అర్థమై యుండెడిది!

అ.ప్ర: ఆ! ఇప్పుడు అచటు అర్థమగుచునే యున్నది. పవలంతా భాగవత ప్రవచనములు - సద్దుమణిగిన భామాకలాపములు! ఎంత నమ్మించినా డెంత నమ్మించినాడు! అవ్వా! అవ్వా! అవ్వా! దేవాలయమున ప్రవేశించి తరతరాలుగా స్వామి అభయ హస్తమును అలంకరించియున్న వజ్ర వైఢూర్య మకరత మాణిక్యాదిదీవమణిస్థగితకరకంకణ మపహరించి ఒకవేశ్యకు, వేశ్యకు ఇచ్చినాడే? వాడెంత తెగించినాడయ్యా!

అర్చ: అయినదా?

అ.ప్ర: అయినా నేను దేవనర్తకిని, దేవనర్తకిని అని వగలుకురిపించి మగవారిని దరిదాపులకే రానీయననెడు ఆ వన్నెలాడి ఈ దాసరిని పట్టినది. దానికేమి పోగాలమో!

అర్చ : ఒక్కమాటు ....

అ.ప్ర : ఆఁ! అంతియే! ఇట్టివారైన గుట్టు బట్టబయలు కాదని .... అదియును కాక .... అవునవును .... దేవాలయమున ప్రతి దినమూ నాట్యముపేరుతో హొయలొలుకబోసెడిది. స్వామి కంకణముపై కన్ను వేసినది. మలభముగా దానిని కొట్టివేయ దలచి, సరియగు వానినే పట్టినది! కన్ను కొట్టినది. మీ దాసులవారికి దాని పిచ్చి బాగాపట్టు ముదిరి, అడిగినదే తడ వుగా కంకణము నపహరించి దాని కిచ్చినాడు. గ్రహచారము బాగుగాలేక వ్యవహారము బెడిసికొట్టినది. శ్రీహరీ! శ్రీహరీ!

అర్చ : ఇదంతయూ అభూతకల్పనము! దాసులవారు జ్ఞాన వైరాగ్య ములు మూర్తీభవించిన ఉన్నతులు. అనేకులైన అజ్ఞానులను ఉద్ధరించుటకుగాను తాను ఆచరించి ఇతరులకు ప్రబోధించు చున్న సదాచార్యులు. లేకున్న అనంతమగు సంపదలను అడుసువలె భావించి, పరిత్యజించవలసిన అవసరమేమున్నది? దాసపథ మనుసరింపవలసిన అగత్యమేమి? భిక్షావృత్తితో జీవిం చవలసిన కర్మయేమి? వేశ్య యెక్కడ? దాసులవా రెక్కడ! స్వామి కంకణమెక్కడ! అపహరించు టెక్కడ! వేసిన తలు పులు వేసినట్లేయుండి కంకణము పోవుట, ఆ కంకణము మరు నటి దినమే వేశ్య తాను ధరించివచ్చి పట్టుబడ్డ దాసులవారిచ్చి రనుట – వీరు నమ్ముట, అర్థార్థసంబంధము లేవైన కనబడు చున్నవా?

అ.ప్ర : ఆఁ! ఆఁ! కనబడుచున్నవి! ఇప్పటికి గుడిలో కట్టివైచి కొట్టిన నూరు కొరడాదెబ్బలు మీ దాసులవారి 'మేని'పై కనబడు చునే యున్నవి! రేపు విచారణ పూర్తి అయిన తదుపరి ఇంకేమి కనబడునో మరి!

అర్చ : నీ అజ్ఞానమునకు పశ్చాత్తాపపడు ఘడియ త్వరలోనే రాగలదు.

అ.ప్ర: సరి సరి! ఈ పురాణమును ఇంకెవ్వరికైనను వినిపించుము, నా కవసరమగు పనులున్నవి. వచ్చెదను!

(నిష్క్రమించినాడు.)

అర్చ : విఠలా! నిన్ను నమ్మిన పురందరదాసులవారిని ఎన్నికష్టముల బెట్టితివో, వారే స్థితిలో నున్నారో ఒక్కమారు దయతోచూడు తండ్రీ! దయతో చూడు!

[నిష్క్రమణ]

—: తెర :—

[పండరీపురమందలి విఠలమందిరము. ఒకస్తంభమునకు దాసులవారిని కట్టివేసియున్నారు. వారి శరీరముమీద కొరడా దెబ్బలచారలు పడియున్నవి. దండనాథుడు కాపలాకాయుచున్నాడు. దాసులవారికి స్పృహలేదు. ఆయన పాదాలచెంత సరస్వతి మూర్ఛిల్లి యున్నది. అర్చకుడు ఒకబుట్టలో పళ్ళు, పూలు మొదలగు అర్చన సామగ్రితో, ఒక నీటిచెంబుతో ప్రవేశించినాడు. పరిస్థితి గమనించి బాధపడి] స్వామీ.... స్వామీ.... (దండనాథుడు దాసులవారి దగ్గరకు వచ్చుచున్న పూజారిని 'ఊ' అని అడ్డగించును).

అర్చ : ఏమి దండనాథా! అంతయునూ అయినదికదా! దాసుల వారిని ఇంకనూ బంధించియున్నారేమి! అయ్యో! ఒంటిపైన స్పృహయైనను లేదు. కొద్దిగా నీరైనను త్రాగించుటకు అనుమతింతువా?

దండ : అయ్యా! అటువంటివేమియునూ మాటాడరాదు. ఇంకను విచారణ యున్నదట! అయినా దారినపోవు దానయ్యకొఱకు మీరెందుకండీ, యింత విచారించుచున్నారు?

అర్చ : హాః! దండనాథా! దాసులవారి వ్యక్తిత్వము తెలిసి వారి యందు అభిమానము, భక్తి, ఆదరములను చూపువారలలో నే నొకడను. అధికారులకు చెప్ప శక్తి లేక, శిక్షకు అడ్డుపడు సామర్థ్యము లేక అసమర్థుడనై యున్నాను. హాః! దైవమే మౌనము వహించియుండ ఇంకెవరి కిక్కడ మొరపెట్టు కొందును?

దండ : భలేవారలే! తెల్లనివన్నియూ పాలేనా! అయిన యీయన తప్పే చేయలేదందురా!

అర్చ : ఈ మహానుభావుడే అతుల చేసియుండిన కాలగతియే నిలిచి పోయి ఉండును.

దండ : ఓహో! మఱి ఇంతవరకు జరిగినవన్నియును?

అర్చ : అబద్ధములే!

దండ : ఏమీ? అబద్ధమా? ఏదండీ అబద్ధము? దేవునికంకణ మప హరించుటయా? వేశ్య ఆ కంకణమును ధరించి ఆలయము నకు వచ్చుటయా? ఆమె అధికారుల యెదుట దాసులవారే తనకీ కంకణము నిచ్చిరనుటయా? విచారణ సమయమున వీరు మౌనము వహించుటయా? ఏది అబద్ధము?

అర్చ : లేదు దండనాథా! కంటికి కనబడినదంతయూ అన్నివేళలా సత్యము కాదు. దాసులవారి గతచరిత్ర గమనించిన ఈనాటి సంఘటనము నిజమని యెవరూ యెన్నడునూ విశ్వసింపరు. దండనాథా! దాసుల వారొకప్పుడు ఈ ప్రాంతముల కన్నిటి కినీ మహాధనికుడు! నవకోటి నారాయణుడని పేరు గాంచిన వారు! ఆ సంపత్తును తృణముగా నెంచి భార్యాపుత్రులతో కదలివచ్చిన పూతాత్ముడు. అంతటి వైరాగ్యసంపన్నులు ఈ

నాడు తన విభుడగు విఠలుని కంకణము అపహరించి, దానిని వేశ్య కొనగెదరా? ఎన్నటికిని కాదు. ఈ ఘటనవెనుక ఏదో భగవల్లీల దాగియున్నది.

దండ: అటులైన విచారణ సమయమున మౌనము నేల వహించ వలయును?

అర్చ: అదే నాయనా! మహాజనుల ప్రవర్తనలోని రహస్యము. సుఖమైననూ, దుఃఖమైననూ స్వామిలీలయే యని అనుభవించుటయె వారి ఔన్నత్యము.

దండ: అటులనా! మీరు చెప్పినవన్నియు నూ నాకు తెలియువు. నేను చేయజాలిన దేదియును లేదనుకొనుడు.

అర్చ: నీ దేమున్నది నాయనా! భక్తవరదుడగు ఆ పాండురంగడే చేయి వదలినపుడు ఎవరు మాత్రము ఏమి చేయగలరు? పాండురంగా! భక్తవరదా! భక్తరక్షకా! ఏమి నీ పరీక్ష! తన సర్వస్వము భవదర్పణము గావించి నిన్నే నమ్ముకొనియున్న దాసులవారికా ఈ శిక్ష? స్వామీ! ధర్మరక్షకా! ఇక నీవు మౌనము వహించినచో అస్తికత బుగ్గియై సర్వత్రా అధర్మమే స్వేచ్ఛావిహారము గావించును. అక్రమము విలయతాండవ మొనర్చును. రంగా! ఇది పురందరదాసులవారికి శిక్ష కాదు. నీవు స్వయముగా నిర్మాణమొనర్చి నిలబెట్టిన ధర్మమునకే విషమపరీక్ష. నాబోటి అల్పుల నెందరినో ఉద్ధరించిన ఈ యున్నతుని పరిరక్షించి ధర్మోద్ధారకుడ వనునది సార్థకము చేసికొనుము.

(వరదుడు నిరాశతో ప్రవేశించినాడు.)

నాయనా! వరదా! మహారాజుకడ కేగితివా? రాజేమనినాడు?

వర: హుం! అనుటకే మున్నది! వెన్న తిన్నాడన్న ఈ విఠలుని మనస్సే కరుగకయుండ ధనమదాంధుడై అధికార గర్వితుడై క్రొవ్వి బలిసిన కఠిన, కర్కశ, పాషాణమనస్కుఁడా రాజు కరగునా? భగవంతుడు భక్తాభీష్టముల దీర్చుటకు అమర సేనాసమేతుడై అరుదెంచి, సంరక్షించు ననునది అసత్యము! మనసా, వాచా, కర్మణా తననే నమ్మి సర్వమును సమర్పించిన నా తండ్రికి ఇట్టిదుస్థితి కలిగినను, మౌనము బూనిన ఈ విఠలుడు భక్తబంధువు కాదు!

అర్చ: నాయనా వరదా!

వర: నీవా వరదుడవు? కరి, ధ్రువ, బలి, పాంచాల్యాహల్యాదులను కాచిన ఆర్తత్రాణపరాయణుడవా? పరమపాపియగు అజామిళుని అపరాధముల నెంచక రక్షించిన కరుణామయుడవా? లేదు! లేదు! యోచించిచూచిన ఇవన్నియును కట్టుకథలు-పుక్కిటి పురాణములు. నమ్మినవారిని రక్షింపచేతకాని నీకు ఆ బిరుదములన్నియు ఎందులకు? ఎందులకు?

[అర్చకుని యెదపై వ్రాలి ఎక్కిఎక్కి యేడ్చినాడు .... .... గంటలు గణగణమ్రోగినవి. అశరీరవాణి....' భక్తులారా! నా దాసుడు నిరపరాధి. నాకు ఈ పురందరదాసునకును మధ్య దాగిన ఒక వ్యవహారముకు పరిహారముగా నేనే స్వయముగా సంకల్పించి ఆ సానికి ఈ సన్మార్గగామి రూపమున కంకణ మొసంగితిని. రాజునకు నా యాజ్ఞగా ఈ విషయము తెలుపుడు. ఇదిగో నా కంకణము నాహస్తమునందే యున్నది'.]

వర: పాండురంగా! పాండురంగా!

అర్చ: దేవాదిదేవా! పుండరీకవరదా! దండనాథా! అదిగో అదిగో స్వామి శ్రీహస్తమున కాంతులను విరజిమ్ముచున్న వరకంక

ణము! రాజుగారి ఖజానాలో భద్రపరచియుంచిన కంకణము! ఇప్పటికైనా దాసులవారి వ్యక్తిత్వము తెలిసినదా!

దండ : తెలిసినదిస్వామీ! తెలిసినది.

అర్చ : మహారాజునకు ఈ విషయము విన్నవించి వేగమె తోడ్కొని రమ్ము!

దండ : నేను విన్నవించిన విశ్వసించెదరా! మీరునురండు!

అర్చ : సరి! నాయనా వరదా! జాగ్రత్తనాయనా!

[దండనాథుడు, అర్చకుడు నిష్క్రమింతురు.]

వర : [ఆనందముగా దాసులవారిని సమీపించి] తండ్రీ! తండ్రీ! మన పాండురంగడు కరుణించినాడు. [సంకెళ్లు తొలగించు ప్రయత్నముచేయ, అవితొలగలేదు] తండ్రీ [కుదిపి] తండ్రీ! [భయముగా] అమ్మా! అమ్మా! [ఆమెకూడా కదలలేదు.] అమ్మా!....విఠలా! పాండురంగా! భక్తవత్సలా! వరదా! నాతల్లితండ్రులను నాకు దూరము చేయుదువా! వీరి సేవా భాగ్యములేని నాకీజీవితమెందులకు? నీ సన్నిధియందే ప్రాణ త్యాగమొనరించెదను....

[వేణురవము. కృష్ణుడు ప్రత్యక్షమైనాడు. వరదుని చిరునగవులతో వారించినాడు. వరదుడు సంభ్రమాశ్చర్య భక్తిప్రపత్తులతో కరములు మొగిడ్చి నిలబడినాడు.]

కృష్ణ : భక్తా, పురందరదాసా!

[సంకెళ్లు తెగినవి. కనులువిచ్చి స్వామిని గాంచినాడు. సరస్వతియు లేచినది.]

పురం : కృష్ణా! జగదుద్ధారా! భక్తజనమందారా! సౌశీల్య సౌలభ్య వాత్సల్యగాంభీర్యౌదార్యధైర్యస్థైర్య సత్యకామ సత్యసంకల్పా ద్యనంత కల్యాణగుణగణాకారా! భక్తజన మనోమందిర విహారా! నన్ను కావవచ్చితివా! నా ముద్దులదొరా! ధన్యుడ నైతిని. మహిమోన్నతా! పావనచరితా! సురసన్నుతచరణా! పురుషోత్తమా! భానుకోటి ప్రభాభాసమానా! స్వానందపరి పూర్ణా! కృష్ణా! నీ దివ్యమంగళ విగ్రహమునుగాంచి ఈ దినము ధన్యుడనైతిని!

\- ఉగాభోగము -

ఇందినదినవే శుభదినవు
ఇందినవార శుభవార
ఇందినతార శుభతార
ఇందినయోగ శుభయోగ
ఇందినకరణ శుభకరణ
ఇందు శ్రీపురందర విఠలన దరుశనవే సందరుశనవు.

కృష్ణ : దాసా! అనాడు తిరుమలపై నన్ను కొట్టిన యపరాధము నకు శిక్షనిమ్మని అడిగినది గురుతున్నదా! ఇదియే దాని పరిహారము. ఇకనీ దుఃఖప్రారబ్ధము ముగిసినది!

పురం : స్వామీ!

\- పాట -

రాగం: పూర్వి — తాళం: అట

ముయ్యకె ముయ్య తీరితో -జగ
దయ్య ఎన్నయ్య కాయయ్య పంఢరిరాయ ॥ప॥

పణ్ణవనెందు వా నీరు కారెందరె
ఎన్న వంచిపి నీను రాత్రియల్లి
చెన్నదికలశది జలకందు కొట్టరె
నిన్నందు కుక్కిదక్కిగ పంఢరిరాయ ॥1॥

శ్రీలోల నిన్న మహిమె ఎష్టెందు హేళలి
కాలసాధిసి ఎన్నరూప తాళి
సూళెగె కంకణ కొట్టు తోరిదె నర
లీలెయ సైసైయ్యదేవ పంఢరిరాయ ॥ 2 ॥

సకలజనరునోడె మానభంగవుమాడి
భకుత వత్సలనెంబ బిరుదెత్తిదె
యుకుతియలి నినగెల్ల ఎడెగాడె జగదొళు
అకళంక పురందర విఠల పంఢరిరాయ ॥ 3 ॥

శ్రీహరీ! నాసర్వస్వము భవదధీనము! సరస్వతీ, వరదా, స్వామిని తనివితీరా అర్చింతము - రండు!

[సరస్వతి అభువనైక మోహనుని దర్శించుచునే యాంత్రిక ముగా ప్రక్కనేయున్న పళ్లెరములోని పూజాసామగ్రిని క్రిందపెట్టి పళ్లెరము దాసులవారికి అందించినది. దాసులవారు ఆపళ్లెరమును ఒకచోటునుంచి స్వామిని అందువేంచేయమని ప్రార్థించినాడు. స్వామి ఒయ్యారపు నడకలతో వచ్చి అందునిలబడినాడు. వరదుడు నీటి చెంబును తల్లికి అందించినాడు. పురందరదాసులవారు స్వామిపాదాల చెంతకూర్చుని సరస్వతిని నీరు పోయమన, ఆమె పోయుట కుపక్ర మించ, ఆపి]

పురం : ఊహుఁ! గంగా జనకా!

మంగళభిషేకక్కె ఉదక తరువెనెనె
గంగెయంగుష్ఠది పడెదిరువె
సంగీతకీర్తనె పాడువనెందరె
తుంబురునారదరు పాడుతిహరో దేవ

గంగోత్పత్తికి కారణభూతములగు నీ అప్రాకృత పరమపావన చరణారవిందముల నభిషేకింప యీ ప్రాకృత నీరము పరిపోవునా? ఊహుఁ!

[సరస్వతిని పుష్పము లిమ్మని సైగజేయ ఆమె అందించినది. వాటిని వేయబోయి, ఆగి]

పద్మనాభా!

పుష్పవతందు నినగర్పిసువెనెనె
పుష్పవల్లవిసిదె కొక్కళల్లి
ఇప్పత్తె త్రిసకోటి దేవర్కళలి ఒబ్బ
వప్పనై వేద్య నీడలు తృప్తనాగువెయో

భూరూపముతో, చతుర్దశదళములతో విప్పారిన అపూర్వమగు సువర్ణమయకమలము, నీనాభినుండి వెలువడి వెలుగొందు చుండ ఈ పుష్పములెట్లు సరిపోవును? నిత్యతృప్తా! ఏమొసగి నిన్ను మెప్పింతును?

నిత్యగుణార్ణవ నిజగుణపరిపూర్ణ
సచ్చిదానంద శ్రీసనకాదివంద్య
ముక్తిదాయక నమ్మ పురందరవిఠల
భక్తిదాయకనెందు స్తుతిసి కొండాడువె.

నిన్ను స్తుతించుటయను ధనము కాక నాకడ మరేమున్నది?

కృష్ణ : పురందరా! పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో, పవిత్రమగు హృదయమో, అదియిది యనునదేమి? భక్తితో ఏమిచ్చిననూ తృప్తినొందువాడనే!

పురం : అహో! అహో! ఎంతదయామయుడవు ప్రభో! [సరస్వతిని నీరుపోయమని సైగచేసినారు. సరస్వతి నీరు పోయుచుండగా స్వామి పాదములభిషేకించుచినారు. నేపథ్యములో వేదఘోష వినవచ్చుచున్నది.

హరిః ఓం॥ అథ పురుషోహ వై నారాయణోఽకామయత ప్రజాః సృజేయేతి నారాయణాత్ప్రాణో జాయతే మనస్సర్వేంద్రియాణిచ। ఏవం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ। నారాయణాద్బ్రహ్మో జాయతే। నారాయణాద్రుద్రో జాయతే। నారాయణాదింద్రో జాయతే। నారాయణాత్ప్రజాపతయః ప్రజాయంతే। నారయణా ద్వాదశాదిత్యా రుద్రావసవః। సర్వాణి చ ఛందాగుంసి। నారాయణాద్దేవ సముత్పద్యంతే। నారాయణే ప్రవర్తంతే। నారాయణే ప్రతీయంతే। అథ నిత్యో నారాయణః। బ్రహ్మానారాయణః శివశ్చనారాయణః శక్రశ్చనారాయణః ద్యావా పృథివ్యౌచ నారాయణః కాలశ్చనారాయణః దిశశ్చ నారాయణః ఊర్ధ్వంచ నారాయణః అధశ్చనారాయణః అంతర్బహిశ్చ నారాయణః నారాయణాయే వేదగుం సర్వమ్। యద్భూతం యశ్చ భవ్యమ్। నిష్కలో, నిరంజనో, నిర్వికల్పో నిరాఖ్యాతో శుద్ధోదేవ యేకోనారాయణః నద్వితీయో స్తి కశ్చిత్ యయేవం వేదా। ఇత్యుపనిషద్–ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః హరిః ఓం–]

అభిషేకమైనది. అనంతరము పాదములొత్తి పుష్పముల సమర్పించి, ఫలముల తినిపించి, ఆనందముతో చూచుచున్నారు.]

కృష్ణు : భక్తా, పురందరా! సంప్రీతుడనైతిని. నేను సదా మీవాడను. "వైకుంఠం వా పరిత్యక్ష్యే న భక్తాన్ త్యక్తుముత్సహే" వైకుంఠమునైన వీడెదను. కాని మిమ్మువదలి ఒక్క అరగడియయేనియు ఉండనోపను. మీ మనోవాంఛాసిద్ధి గావించుటకు సదా సంసిద్ధముగా నున్నాను. కోరుకొనుడు!

పురం : దేవదేవా! నయనానందకరమగు నీ సుందర విగ్రహమును దర్శించుచూ పొందు ఆనందముకన్న అన్యమున్నదా? వరాల వేల్పువు నీవుకావు. వరముల కోరు భృత్యులమూ మేము కాము. అయిననూ లోకమునకు మంగళము కలుగజేయుము. జనులకు నీయందవిచ్ఛిన్నమగు భక్తియుండునటు లనుగ్రహింపుము.

కృష్ణు : దాసశ్రేష్ఠా! సంప్రీతుడనైతిని. ఇక "దాసులనిన పురందర దాసులే" యని నీ చరిత్ర లోకమున కాదర్శప్రాయమై, భక్త జనమనోమందిరములం దావాసమేర్పరచుకొని పాపహారకమై పుణ్యవర్ధకమై, చిరస్థాయియై, లోక క్షేమంకరమగునుగాక!

పురం : ధన్యోస్మి ప్రభో ధన్యోస్మి!

విఠల సలహో స్వామి నమ్మమ - విఠల సలహంతర్యామి
ఎడకె విఠల బలకె విఠల - ఎడకె బలకె పురందరవిఠల
బంధు విఠల బళగ విఠల - బంధు బళగ పురందరవిఠల
తందె విఠల తాయి విఠల - తందెతాయి పురందరవిఠల
విఠల విఠల విఠల విఠల - జై జై విఠల జై జై విఠల
పండరినాథా విఠలా - పాండురంగా విఠలా
పండరినాథా పాండురంగ - పండరినాథా పాండురంగ
పాండురంగ పాండురంగ - పాండురంగ పాండురంగ
పాండురంగ పాండురంగ - పాండురంగ పాండురంగ
రంగా - రంగా - రంగా - రంగా - రంగా

[భజనచేయుచూ ఆనందముగ ప్రదక్షిణము చేయుచున్నారు. స్వామి మహానందపరవశుడైనాడు. సుమవృష్టి గురియుచున్నది.]

దాసరెందరె పురందరదాసరయ్య
వాసుదేవ కృష్ణన్న నూని నూజిసువ ॥ వ ॥

నీతియల్లవనరితు నిగమవేద్యన నిత్య
వాతసుత నల్లిహన వర్ణిసుతలి
గీతన ర్తవదింద కృష్ణన్న పూజిసువ
పూతాత్మపురందర దాసరివరయ్య ॥ దా ॥

[తెరలు ఆనందముగ కలుసుకొనినవి]

శ్రీమధ్వేశార్పణమస్తు – శ్రీనివాసార్పణమస్తు

* * *

## పాట: 1

శ్రీపతియె మనకు సంపదలొసగుగాత, వా
ణీపతియె మనకు దీర్ఘాయువొసగును గాత ॥ప॥

వరసురలబ్రోవ గళమున గరళమూనిన
హరు డహరహము మనతోడు నీడగు గాత
నరులయం దున్నతములగు నిత్యభోగముల
పురుహూతు డొనగూర్చు గాత పూర్ణముగ ॥1॥

వినుతసిద్ధిప్రదుడు విఘ్నేశ్వరుడు దయను
అనుకొన్న కార్యముల నెరవేర్చుగా త
అనుదినము ధన్వంత్రి ఆపదల నెడబాపి
మనమునకు ముదము నెడతెగక గూర్చుమ గాత ॥2॥

నిరత సుజ్ఞానమ్ము నిచ్చు మధ్వరాయ
గురుదీవెనలు మనకు నెపుడు కలుగుమ గాత
పురందరవిఠలుని కరుణవలనను సకల
సురవరుల దయ మనకు సుస్థిరమ్మగు గాత ॥3॥

## పాట: 2

అరుదెంచినదెవ్వరే ఇంటికి అరుదెంచినదింకెవ్వరే ॥ప॥

నారాయణ కృష్ణనాథుడు గాక ఇంక ॥అ.ప॥

వజ్రరేఖలింట కనబడెనే, కాళ్ళ
గజ్జెల సవ్వడులు వినబడెనే
వజ్రమాణిక్యములు వెదజల్లియున్న వే
మజ్జిగలో వెన్న కానరాదేమే ॥1॥

కొమ్మలు పిల్లనగ్రోవులు మ్రోగె, విర
జిమ్మె కస్తురికదంబపు తావులు, వే
లమ్ములు చెల్లాచెదరై గృ
హమ్మెల్ల వెల్లాయె పాలకడవలు వగుల ॥2॥

మెరుపు మెరసినటు మెరయుచు తన సహ
చరులతో గలసి చరించుచును
వంచనతో వెన్ననారగించు మన
లంచపు పురందరవిఠలుడు గాక ॥3॥

## పాట: 3

మంగళం శ్రీతులసీదేవికి ॥ప॥

మంగళం బృందావనదేవికి ॥అ.ప॥

దరిసించినంతనె దోషముల నెడబాపి
కోరిన వరములను కరుణనొసగి
మ్రొక్కిన మనుజుల పాపరాసుల
గ్రక్కున బాపేటి గుణరాశికి ॥1॥

వేరులకు చేరెడు నీరుబోసినచాలు
దరిజేర యమునకుమ కలుగు వెరపు
ముట్టిన మాత్రమున ముక్తులమ గావించి
ముదమున బ్రోచు నా మునివంద్యకు ॥2॥

## పాట: 4

అసురుడు వెన్నంటిరాగ - పశుపతిని కాచినావు
ఋషిశాపము దీరిచి అంబరీషు బ్రోచినావు
వసుధ బండయైపడిన అహల్య నుద్ధరించినావు
శిశువగు ప్రహ్లాదు నాదుకొనినావు
దశకంఠుని అనుజునకు స్థిరపట్టము గట్టినావు
స్వసుతు దలచినని అజామిళు తరింపజేసినావు
వసుదేవసుతా వన్నెలరా!

## పాట : 5

లక్ష్మీ మనోహరా! ఇక్షుచాపుని జనక!
యక్షగంధర్వామరేంద్ర మునివందితా!
అక్షయా! మోహింపజేయుగా జగములను - స్థూల
సూక్ష్మముల యందున్న పరిపూర్ణా!
కుక్షి నీరేడులోకముల నేలెడివాడ!
దక్షసుతపతి సఖా! ఓపక్షివాహనా!
రక్షమాం రక్ష! అనాథబాంధవ రక్ష!

## పాట : 6

తల్లి, తండ్రి - నీవె
బంధుబలగము నీవె
కులనాథ గురు పితామహుడ వీవె
అనుచు నమ్మినాదు మానాభిమానముల
ముకుందా నేడు నీ కర్పించినాను
కాలరాచిన నీవె, కాచినను నీవె
దేవా! రక్షమాం! రక్ష! దేవా!

## పాట : 7

అణురేణుతృణముల పరిపూర్ణుడైయున్న
గుణవంత నీమహిమ గణియించువారెవరు
గణియించుచునెయున్న దేవాక్షి శ్రీదేవి
జ్ఞాన సుగుణతత్వ వేణుగోపాల హరే
కనజేయు నీమహిమ పురందరవిఠల

## పాట: 8

ఇదిగో చూడవె రంగనాథుని చిన్నిపాదము
దొరకెను శ్రీలక్ష్మినాథుని దివ్యపాదము ॥ ప ॥

శంఖచక్రగదాపద్మ అంకితపాదము
అంకుశ కులశధ్వజరేఖా అంకితపాదము
పంకజాసనుని హృదయమ్మందున నర్తించు పాదము
సంకటహరణ వేంకటేశ్వరుని దివ్యపాదము ॥ 1 ॥

లలన లక్ష్మి అంకమందున చెలగెడి పాదము
జలజాసనుని అభీష్టములెల్లను ఒసగెడి పాదము
మల్లులగెలచి కంసాసురుని చంపిన పాదము
బలినిత్రొక్కి భాగీరథినిబడసిన పాదము ॥ 2 ॥

బండను బాలగజేసినట్టి ఉద్దండ పాదము
బండిలోనున్న శకటాసురుని తన్నిన పాదము
అండజవాహనుమల భుజములపైన ఒప్పెడి పాదము
కంటిమే శ్రీరంగవిఠలుని దివ్యపాదము ॥ 3 ॥

## పాట: 9

నీ మాయ జగము నంతయును చుట్టినదయ్యా
నా మానసము నిన్ను చుట్టినయ్యా
తల్లిదుడవు నీవు జగములన్నింటికి
తల్లిదుడనయ్యా నీకంటె నేను
మూడులోకమ్ములు కలవు నీలోన
కలవయ్యాస్వామి నాలోన నీవు
అద్దమున ఏనుంగు అణగిన తెరగున
అణగితివి నాలో పురందరవిఠలా!

## పాట: 10

దాసుని చేసుకోనమ్మ స్వామి,
వేయినామముల వెంకటరమణ ॥ ప ॥

దుర్బుద్ధులనెడబాపి నీ
కరుణకవచమును ఉసురులతొడిగి
చరణసేవ నాకొసగి, అభయ
కర పుష్పము నా శిరమున తురిమి ॥ 1 ॥

దృఢభక్తి నీయెడలవేడి నే
పొడి నీపదములపై బడియుండ
కడకంటజూచి విడుతువదేల
మడిజేసి మనసును నీధ్యానమొసగి ॥ 2 ॥

మొరవిని కాచేదొరవని నీకు
బిరుదుగలదు నను కరుణించి కావ
దురితములను దూరముగ తరిమి శ్రీ
పురందరవిఠల నను పాలింపవే ॥ 3 ॥

## పాట: 11

గ్రామదేవత కొలువవలెనన్నా తనలోన తానే ॥ ప ॥

గ్రామదేవత కొలువుమని శ్రుతి చాటుచున్నది రేయిబవలు
తొమ్మిది తలుపులను మూసి చూపు
భ్రూమధ్యమున నిలిపి ॥ అ.ప ॥

ఎన్నొ యుగములు గడచెరోరన్న దేవతను కొలువక
ఎన్నొ ఇడుముల బడితిరోరన్నా
అష్టదళ స్తంభమును నిలిపి కట్టిచక్రాలవేసి
సృష్టికర్తసన్నిధిని ఆ దుష్టదున్నతలను నరికి ॥ 1 ॥

కష్టకర్త యనెడుమేకన్నా దానితెచ్చి
పట్టితలను ఛితకగొట్టన్న
అష్టమదముల మేకలనుకట్టి శిరముల చెండులాడి
అంటి తిరుగుచున్నకోడిని కొట్టివెదజల్లేయరన్నా ॥ 2 ॥

ముందుముందీ జన్మరాదన్న చూడన్న నీకు
మందమతి వలదురోరన్న
క్రిందటికష్టాల మరచి ముందు అహమును వదలిపెట్టి
పొందుగా పురందరవిఠలుని పొందెదవు ముక్తినిగాన ॥ 3 ॥

## పాట: 12

కలియుగమున హరినామము దలచిన
కులకోటులు తరియించునులే ॥ ప ॥

సులభమ్మగుము క్తికి సులభుడనెడు
జలరుహనాభుని తలచవె మనసా ॥ అ.ప ॥

స్నానము నెరుగను మౌనము నెరుగను
ధ్యానమే నెరుగ ననవలదు
జానకివల్లభు దశరథనందను
గానవినోదుని తలచవె మనసా ॥ 1 ॥

అర్చించుటెరుగను మెప్పించుటెరుగను
తుచ్ఛుడనేనని అనవలదు
అచ్యుతానంత గోవింద ముకుందుని
ఇచ్ఛతోడ తలచవె మనసా ॥ 2 ॥

జపముల నెరుగను తపముల నెరుగను
ఉపదేశము లేదనవలదు
అపారమహిము శ్రీపురందరవిఠలుని
ఉపాయముతోడ తలచవె మనసా ॥ 3 ॥

## ఉగాభోగము : 13

ఏదైవమునకును ఈ వైభవముగాన
తిరువెంగళప్పా! శ్రీనివాసా!
ఏదైవమునకును ఈ వైభవముగాన
రావణాంతక! స్వామి! పురందరవిఠలా!

## పాట: 14

పువ్వులిచ్చేయింట గడ్డిమోసేను
అవ్వలక్ష్మీశునకు గర్వమేలేదు ॥ ప ॥

బిందుగంగోదకము ఒక్కతులసీదళము
ఇందిరారమణ నీకర్పితమ్మనుచు
సింధుశయన ముకుంద యన నేకచిత్తమున
మందిరము వీడక వసించుననవరతము ॥ 1 ॥

పరిపరిపుష్పముల వరమాత్మ కర్పించి
పరిపూర్ణుడనుచు పూజలను గావించి
వరమానురక్తితో పరిచర్య లొనరించ
సరిభాగమిచ్చు తన వరమపదమందు ॥ 2 ॥

పాండవులయింటలో అశ్వముల కడిగి
పుండరీకాక్షుడు పూనికతో మేపె
అండజవాహనుడు శ్రీపురందరవిఠలుడు
నడయాడు దాసులకు దాసానుదాసుడై ॥ 3 ॥

## ఉగాభోగము : 15

తలచలేదు పగలునిన్ను ఆకలిదప్పులతో
తలచలేదు రేయినిన్ను నిద్రాభారముతో
కలతలరెంటికి నే లోనై తిని పురందరవిఠలా

## ఉగాభోగము : 16

తప్పులు వేయైనను ఒప్పికొయు కృపాళో
ముప్పూరముల నణచిన మునీంద్రవంద్యా
అప్రమేయ నీ అమేయమహిమల
ఆ పయోధిసుతయే ఎరుగదట
ఒప్పారెడు కారుమబ్బుకాంతుల తిమ్మప్పా
అప్రాకృతరూపా ! పురందరవిఠలా !

## పాట : 17

రావయ్యా వెంకటరమణా - భక్తనిధానా
తోయజనయనా ! కరుణను నను గన ॥ ప ॥

వేదగోచర రార - ఆదికచ్ఛప రార
మోదసూకర రార సదయ నృసింహ రార

వామనభార్గవ రార ! రామ ! కృష్ణా ! రార !
ప్రేమాత్మబుద్ధ రార ! స్వామికల్కి రార !

అరవిందనాభరార ! సురసార్వభౌమ రార !
పురుహూతవంద్య రార ! పురందరవిఠల రార !

## ఉగాభోగము : 18

ఈదినమ్మె శుభదినమ్ము
ఈవారమె శుభవారము
ఈయోగమె శుభయోగము
ఈకరణమె శుభకరణము
ఈతారయె శుభతార
ఈ పురందరవిఠలుని దర్శనమే సందర్శనము !

## పాట : 19

ముయ్యికి ముయ్యితీరినది ! జగ
దయ్య మా అయ్య కావవయ్య పండరిరాయ ॥ ప ॥

చిన్నవానిని నేమ నీరుతెమ్మనగా
వన్ను నేమార్చి నీవు ఆరేయి
కనకకలశంబున జలకమునీయగ
నిమనాడుకొట్టినందులకు పండరిరాయ ॥ 1 ॥

శ్రీలోల నీమహిమ లెన్నని చెప్పను
కాలాన సాధించి నారూపుదాల్చి
కలికికి కంకణమిచ్చి చూపితె నర
లీలల భేషయ్య ! దేవ పండరిరాయ ॥ 2 ॥

అఖిలజనులు చూడ అవమానముచేసి
భక్తవత్సలుడను బిరుదుబడసితివి
యుక్తిలో నీకు సరిజోడు జగమున లేరు
అకళంక పురందరవిఠల పండరిరాయ ! ॥ 3 ॥

## పాట : 20

మంగళాభిషేకమునకు ఉదకము తెత్తుమన్న
గంగపుట్టినదయ్య నీ అంగుష్ఠమున
సంగీతకీర్తన పాడుదమన్నమ
పొంగి, నారదతుంబురులు పాడుచున్నారు

పుష్పమ్ము దెచ్చి సమర్పింతమనుకొన్న
పుష్పమ్ము నీ నాభిలో పల్లవించినది
ముప్పదిమూడుకోట్ల అమరులందొకడేని
ఒప్పి నైవేద్య మిడ తృప్తుడవగుదువు

## పాట: 21

విఠల! రక్షించు, స్వామీ, మమ్ములను-విఠల రక్షించు అంతర్యామి
ఎడమను విఠల కుడిలో విఠల - ఎడమకుడిలో పురందరవిఠల
బంధువు విఠల బలగము విఠల - బంధువు బలగము పురందరవిఠల
తండ్రీ విఠల తల్లీ విఠల - తండ్రీతల్లీ పురందరవిఠల
విఠల విఠల విఠల విఠల - జై జై విఠల జై జై విఠల
పండరినాథావిఠలా పాండురంగ విఠలా
పండరినాథా పాండురంగా - పండరినాథా పాండురంగా
పాండురంగా పాండురంగా - పాండురంగా పాండురంగా
పాండురంగా పాండురంగా - పాండురంగా పాండురంగా
రంగా - రంగా - రంగా - రంగా - రంగా

## పాట: 22

దాసులన్నను పురందరదాసులయ్యా
వాసుదేవకృష్ణుని వాసిగా పూజించు ॥ ప ॥

నీతినంతనెరింగి నిగమవేద్యుని, నిత్యము
వాతసుతునందుండు వాని వర్ణించుచును
గీతన ర్తనములతో కృష్ణుని పూజించు
పూతాత్ములౌ పురందరదాసులు వీరయ్యా ॥ 1 ॥

